గౌరవాధ్యక్షుఁడు,

మ. రా. శ్రీ.

యఱ్ఱమిల్లి నారాయణమూర్తిగారు,

బి. ఏ., బి. యల్.,

నర్సాపురము.

అయ్యగారి బాపిరాజు,

సంపాదకుఁడు.

శ్రీరాజన్ముద్రాశాల, రాజమండ్రి.

1926



వెల,

ఇతరులకు 1-4-0 చందాదారులకు 1-0-0

# మనవి

నవలారాజములనిప్రసిద్ధిఁజెందిన "దుర్గేశనందిని, నవాబునందిని" అను గ్రంథముల నుండి ఇతివృత్తముగ్రహింపఁబడి, కొలఁది మార్పులతో నీనాటకము వ్రాయఁబడినది.

భాషాకోవిదులిందలిసుగుణములను గ్రహించి, దోషములను మన్నించెదరుగాక !

అయ్యగారి బాపిరాజు,
గ్రంథకర్త.

# హెచ్చరిక!

నావ్రాతపూర్వకమగు యనుమతిలేనిదే
ఈనాటకమును బ్రదర్శింపకూడదు.

గ్రంథకర్త.

వలయువారు:—

మేనేజరు,
జ్ఞానపత్రికాశిసీగ్రంథమాల,
పండితవేమవరము.
ఆచంటపోస్టు,
పశ్చిమగోదావరిజిల్లా.

# సమర్పణము

హారిదర్వోన్నతముక్షత్రి । యాన్వయంబు,
లోకవిఖ్యాతమహితమ । ల్లూరివంశ
మేతరు.బచేత మివులధ । న్యతను జెందు!—
ఆంధ్రభాషాభిలాష ; స । త్యానురక్తి ;
కావ్యపోషణ ; సద్గుణ । గణవిభూతి ;
బీదసాదలఁ బ్రేమ ; ని । త్యాదరంబు;
ఏసుధీవరు విడకనిం । పెసఁగుచుండు!—
తారసజ్ఞుఁడటంచుఁ బో । త్తమునుజూపఁ
జదువుఁడన్ని కూర్మి నాఅయే । షాను వినుచు
సద్గుణంబుల గ్రహియించి । సారమెఱిఁగి
అమితమాప్రేమ నెవఁడున । న్నాదరించె!—
అట్టి శ్రీసూర్యనారాయ । ణాఖ్యహితుని
భావివృద్ధికిఁ గృతిని న । ర్పణము జేతు !!—

గ్రంథకర్త.

# పాత్రలు

## —♦ పురుషులు ♦-

జగత్సింహుఁడు.

వీరేంద్రసింహుఁడు.

ధర్మసింహుఁడు.

ఆస్మన్‌ఖాన్.

ఖతల్ ఖాఁ.

రహిమాన్ ఖాన్.

మీార్ ఖాన్.

షర్ ఖాన్.

ఆఫ్జుల్ ఖాన్.

రాజపుత్రసైనికులు.

పఠాను సైనికులు.

తలారులు.

## —*స్త్రీలు*—

ఆయేషా.

తిలోత్తమ.

విమల.

ఖతల్ ఖాను దర్బారులో మంత్రిసేనానాయకులనుఁ నృత్యము నుజూపనగును.

శ్రీ రామ చంద్ర

## నాంది.

మోమున మోముఁజేర్చి, తమి ♦ మోవిసుధారసబిందుధారలన్
గాముకకేళిఁ దేలుమని ♦ గారియవెట్టగ, భక్తసంపదో
ద్దామమహాఘజాలసవి ♦ దారమనోగతభావుఁడౌట మా
కామితదృష్టి మాన్పడిజ ♦ గంబులనాథుఁడు బ్రోచు మిమ్ములన్.

ప్రవేశము: సూత్రధారుడు.

(ఆలోచన)

ఆశాపాశము; ప్రేమపూరితము; వి ♦ ద్యాధిక్యసంపూజితం
బాశాంతర్గతవీర భూషితము; మా ♦ యామోహవిభ్రాజితో
ద్దేశప్రేరిత మాత్మగౌరవగుణో ♦ ద్దీపంబునై ప్రేక్షకా
వేశస్ఫూర్తి నొసంగురూపకము ని ♦ వ్వేళన్ బ్రదర్శింతునా?
(దీర్ఘాలోచన)

ప్రవేశము: నటి

పూలమాలికలు; దరహాసము.

సూత్ర—(పరధ్యానము నటియించును.)

నటి—(సమీపించి చిరునగవుతో సూత్రధారుని కరమును బట్టుకొనును.)

సూత్ర—(ఆనందము)

నటి—(హేళన) పూలమాలికలు—ఉఁ—గొనిరమ్మని నన్ను వేగిరించి ప్రస్తుతకార్యాలోచనమాని, పర—ధ్యా—న—త—నటి యించుచుంటిరేల!—ఆర్యా! పరధ్యానము, పర—నా—రీ—ధ్యానము కాదుగదా!

సూత్ర—(దరహాసము) నటియించుటకు నేను నటినిగాను!—

సూత్రధారుఁడనే! — ప్రియా! నాపరధ్యానము— పరనారీధ్యానమే సుమీ!

నటి—(బొమముడిపాటు; అనవతముఖము.)

సూత్ర—(సమాధానము; ముఖావలోకనము.) నేనా యేషా విషయమై యోచించుచున్నాను!

నటి—(కోప విరామము; చిరునవ్వు) ఆర్యా! మీ రీనాఁడా యేషాను బరిగ్రహింతురా!

సూత్ర—(కోపము) ఆయేషా పరనారి; పతహర్ష నాయిక; ఆమెను బరిగ్రహింపమందువా?

నటి—(హేళన; చప్పటులు) ఆయేషానాటకమును బ్రదర్శనము నకు నేఁడు పరిగ్రహింపవలయు ననినాయభిప్రాయము! ఆర్యా!—ఇంత లోనే గోపమా!

సూత్ర—(సిగ్గు) నే నావిషయమునుగూర్చియే ఆలోచించు చున్నాను;

నటి—అయిన నింకజాగెందులకు? ప్రేక్షకులు వేచియున్నారు!

సూత్ర—ప్రేక్షకులు నాటకప్రదర్శనమును బ్రేక్షింప నాతు రతఁ జెందుచున్నమాట వాస్తవమే! కాని—ప్రియా!—నాటకప్రదర్శ నారంభమునఁ బ్రేక్షకులకుఁ గొంత దెలుపవలసి యున్నది!

నటి—(ప్రశ్నార్థము) ఏ దది?

సూత్ర—ఈ కృతికర్త విషయమునను—ఈ కృతిభర్త విష యమునను—

నటి—(స్ఫురణ) ఎంత మతిమాలిన దానను! ఆర్యా! ప్రస్తుత కార్యమును మఱచి ప్రదర్శనమునకై మిమ్ముల వేగిరించుచున్నదానను! ఆర్యా! ఈకృతికర్త యెవ్వరు?

ఉ. త్యాగవిశాలధీవిభవ ♦ ధన్యయశోవిదు లాయువేలని
యోగ్యులు; నందు సద్గుణగ ♦ ణోన్నతకీర్తివిభూషితాంగులై,
ఆగమసూత్రకోవిదులు ♦ నై, శమశాంతవిశుద్ధతన్ మహా
భాగులు నయ్యగారివర ♦ వంశజు లొప్పెడి ధీవిశాలులై.

అట్టి మేటికులావతంసులై, సద్యశశ్శ్రీవిరాజితులై జెలంగు— సకలధర్మముఖోపాయు శ్రీవేంకటసుబ్బరాయునకును, వివిధసద్గుణనికురాంబ శ్రీమతి సుందరాంబకును గూర్చు కొమారుఁ డీకృతికర్త; బాపిరాజాఖ్యుఁడు; వేమవర పురీవాస్తవ్యుఁడు.

నటి—(ఆనందము) బాఁగు!—మఱి కృతిభర్త యెవ్వరు?

సూత్ర—చక్కఁగాఁ బ్రశ్నించితివి. ఈవిషయమునుగూర్చియే నేను ముఖ్యముగాఁ బ్రేక్షకులకు విన్నవింపనున్నాఁడను!—ఎటులంగుదువా చింతలపల్లినా బ్రఖ్యాతంబగుగ్రామము? అందు—

సీ. అతులితవీరభూ ♦ షిత మైనక్షత్రియ
సంజాతుఁ డఖిలస ♦ జ్జనహితుండు;
ఇలమర్రిరిక్షుజా ♦ జ్వలతేజుఁడౌ సూర్య
కులజుండు మేటియౌ ♦ కోవిదుండు;
నిగమాగమాభ్యాస ♦ నియతుఁడౌ వాసిష్ట
గోత్రాన్వితుఁడు శాంత ♦ గుణయుతుండు;
బహుదానగరిమశో ♦ భావంత మల్లారి
వంశీకుఁ డధికవి ♦ ద్వన్నుతుండు;

గీ. హరివిద్యాప్రపూర్ణవి ♦ స్తారసద్య
శోన్నతవిహారి, కలుముల ♦ మిన్నఁజేరి,
సౌఖ్యములమీరి, సన్మార్గ ♦ సరణిఁగోరి,
అలరు శ్రీసూర్యనారాయ ♦ ణాఖ్యుఁడెలమి.

మఱియు—

సీ. సకలలౌకికసార ♦ సికరోన్నతిని మించు
అక్కిరాజన్యుఁ డె ♦ వ్వాని తాత;
లలితవిద్యాభ్యాస ♦ కలితుఁడౌ నరసింహ
రాజన్యుఁ డెవని గా ♦ రాబుతండ్రి;
విమలపాతివ్రత్య ♦ విదితయౌ చంద్రాంబఁ
గన నేసుధీవరుఁ ♦ గన్నతల్లి;
దానశౌశీల్యవి ♦ ద్యాగంధచారుచె
ల్వంబులే బ్రాయమె ♦ వ్వానిసొమ్ము
గీ. లధికసద్గుణశీలు; ద ♦ యానిశాలు
నలతిశ్రీసూర్యనారాయ ♦ ణాఖ్యుఁ, భర్త
గా వరించెను నీకృతి ♦ కన్యనేఁడు;
ఆయురారోగ్యములనాతఁ ♦ డలరుఁగాత!

నటి—బాఁగు!—బాఁగు!—ఆర్యా! ఇఁక జాగైనది. ప్రేక్షకులు వేచియున్నారు.

లోపల.

హర్ హర్ మహాదేవ్; జయ్ హర్ మహాదేవ

అను రాజపుత్రవీరాలాపములు.

దీన్, దీన్ అను పఠహాణ యుద్ధధ్వని.

సూత్ర—(ఉలికిపడి) అదిగో! పఠానులవీరాలాపములు వినవచ్చుచున్నవి. సుల్తాన్ ఖతల్ ఖానుఁడు రాజపుత్రులఁ జయించుటకుగాను నూతనసైనికులఁ బంపుచున్నటు లున్నది ఇంకమనము త్వరపడవలయును—రమ్ము!— (నిష్క్రమణ)

నటి—(సూత్రధారు ననుకరించును)

ఇదిప్రస్తావన.

---



శ్రీరామచంద్ర

# ఆయేషా

## ప్రథమాంకము.

రంగము: అరణ్యము.

పరివేశము: జగత్సింహుఁడు; ధర్మసింహుఁడు; సైని
కులు; భిల్లులు; పఠానులు.

రాజపుత్రులకును పఠానులకును సంకులసమరము—
రాజపుత్రులు 'హర్, హర్, మహాదేవ్' అనువీరాలా
పములు—పఠానులు 'లా, ఇలాహ్, ఇల్లల్లాహ్' అను
యుద్ధధ్వని—పఠాను లంత మొగ్గెదరు. కొందరు పలా
యనము గావింతురు—రాజపుత్రులు నిలచియుందురు.
జగత్సింహుఁడు చేసన్నచే ధర్మసింహునిఁగాక మిగిలిన
రాజపుత్రులను, భిల్లుల నవలికిఁ బంపివేయును.

జగ—ధర్మసింహా! మఱల నీనూతనసంఘటన మాశ్చర్యమును
గొల్పుచున్నదే?

ధర్మ—ఇందాశ్చర్యపడుట కేమున్నది?—ఈపఠహాన్ నాయకుఁ
డగు 'ఖతల్‌ఖానుఁ' డింకను తనమూర్ఖతను విసర్జించినటులలేదు. ఆతఁ

డీకను నూతనసైనికుల స్వప్రదేశముల కనుపుచున్నటుల నాకుఁ దెలియ వచ్చినది!

జగ—నాకు నవ్వువచ్చుచున్నది!—

సీ. 'వంగదేశ' ప్రతా ♦ పంబు మందించిన
'మణ్యాఖాను'ను వీరు ♦ మఱచినారొ!
అల 'నోరిస్సా' రాజ్య ♦ మవలీల గెలిచిన
'ఖాన్ జహా' ఘనపరా ♦ క్రమము వినరొ!
ఖిలులైనయీ 'పఠా ♦ నుల' క్రొవ్వడంచిన
'ఖానజీము'నిఁగల ♦ నైనఁగనరొ!
పలుమారు 'దాయూదు' ♦ ప్రభు గర్వమణచిన
'మహాబాజు' శౌర్యవీ ♦ క్షణమెఱుఁగరొ!
గీ. మఱచినను మఱువవచ్చు నీ ♦ తురకపతుఁ
బ్రళయభీకరరణరంగ ♦ వహ్ని, శత్రు
రక్తధారల నార్పువీ ♦ రప్రతాప
వరుల మూరాజపుత్రుల ♦ మఱువనగునె?

మఱియు, నీ 'అంబరు' రాజవరులఖడ్గధార, వీరి పూర్వనాయకుఁ డగు 'దాయూదుఖానుఁ' డెఱిఁగినటుల, ఈ 'ఖుతల్ ఖానుఁ' డెఱుఁగడు గా బోలును!—

ధర్మ—ఎఱుఁగకేమి?—ఇవన్నియుఁ దెలిసిచేసెడిపనులే! వీరి పూర్వనాయకుఁడగు 'దాయూదుఖాను' డంబరుప్రభుఁడగు మీరాజుని వల్ల పొందినస్థితి నీ 'ఖుతల్ ఖానుఁ' డెఱుఁగకకాదు! ఆదాయూదుకన్న నీతఁడధికుఁడునుగాడు!—

జగ—సర్వము నెఱింగియు నీ 'ఖుతల్ ఖానుఁ' డీ 'యక్బరు' సార్వభౌమసింహము నెందులకు నిదురనుండి మేల్కొలుప సాహసించును?

మ. దురహంకారత నాపఠానుఖిలుఁడై ♦ దుష్టుండు దావూదు' దు
ర్భరభీమాహవకేళిలో మొగలుసా ♦ మ్రాజ్యంబు గెల్పొందఁగా
నిరతంబుగ్ర శ్రమఁ జెందినట్టిఫల మిం ♦ నిర్భాగ్యుఁడీక్రూరదు
ష్కరదుర్మార్గుఁడు, పాతకుండగుఖలల్ ♦ ఖానుం డెఱుంగం దోకో !

నాకుఁ జిత్రమగుచున్నది!—

ధర్మ—చిత్రమున కేమున్నది ?— అగ్నిశలభన్యాయములో నాశ్చర్యముండునే !

తే. గీ. వేఁటకుక్కలెల్ల ♦ వెంటాడి, ముట్టడిఁ
జేరు, జింక యేమి ♦ చేయఁగలదు ?
ప్రతిఘటించి నిలచి ♦ బడి కుక్కలనిలువు,
వేఁటకాఁడు కోల ♦ వేయుదాక !

అదిగాక, ఇప్పుడీపఠానులు, బంగాళారాజ్యమును గోల్పోయి, నిలువ నీడలేక, ఈయొరిస్సాను జేరి, దురాగ్రహావేశులై విజృంభించి యల్లరులఁ జేయుచున్నవారు ! రాజ్యవిహీనులైనవీర లిట్టికార్యంబుల నొనర్చుటలో నాశ్చర్యమేమున్నది ?

జగ—ధర్మసింహా! రాజ్యములను గెలుచుట—గోల్పోవుట—ఆయారాట్పతులసామర్థ్యములలో నుండును.—ఆయారాజ్యములఁ గెలుచుటకును, గోలుపోవుటకును, యుద్ధనిపుణులగు వీరాధికులుందురు. అట్టి వీరవరులొండొరులతోఁ బోరొనరించి రాజ్యలాభములను వడయుట రాజధర్మము!— ప్రకృతిస్వభావము!— ఇట్టిధర్మము లనేకములుండ, నీతిబాహ్యులై, యుద్ధధర్మవ్యతిరేకులై, యుక్తాయుక్తముల గమనింపక, ఈపఠానులు చేయుదుర్మార్గములకు మేరగానరాకున్నది ! కటకటా !

సీ. అతిరాక్షసకసాయి ♦ తాత్ములై బురుషుల
వికలాంగులుగఁ జేసి ♦ విడచువారు;

బహుళముష్కరపరీ ♦ భావనోన్మత్తులై
దోపిళ్లకై యిళ్ళు ♦ దూరువారు;
కుటిలభీకరకోర్కెధ ♦ ఘూర్ణితాత్ములౌచు
గోవుల గుళ్లలోఁ ♦ గోయువారు;
మధురసాస్వాదనో ♦ న్మదమహావేశులై
పొలతుల బలిమిఁగొం ♦ పోవువారు;
గీ. పల్లెటూరులపైఁబడి ♦ కొల్లగొట్టి,
కాల్చి, పాడొనరింపగాఁ ♦ గడగువారు;
వీరిదుశ్చర్యలకుఁ బరీ ♦ హారముండ
దా? దురాత్ముల కెందున ♦ గ్గతులుకలవె?

(కోపముతో) భగవంతుఁడింతయన్యాయము సహించునే! పాప పరిహారముండదే?—

ధర్మ—ప్రభూ! పాపకార్యాచరణము దగినపరిహారములేక నశించునే?—దుష్కార్యాచరణమున కాపరమాత్ముఁడొప్పునా?—నిరపరాధులనుదండించు కుమలతులకుఁ బ్రాయశ్చిత్త ముండకుండునా?—గోహింసకులకు ఫలప్రాప్తి సమకూరకుండునా?—ఇచ్చవచ్చినరీతి మెలంగుచు, ధర్మశాస్త్రప్రతిప్రవర్తకులగుచు—న్యాయములెంచక—క్రూరకార్యాసక్తులై—నిరపరాధులనుబట్టి బాధలుబెట్టు ఈముష్కరుల కెన్నటికైన దుష్టవర్తనఫలప్రాప్తి కలుగకుండునా?—పాపంబులకుఁ బొలిమేర లేకుండునా?—అన్యాయప్రవర్తనకు గమ్యస్థాన ముండకుండునా?—ప్రభూ! ఈచిక్కులన్నియు సరియైనమార్గములోనికి రావలెనన్న—ఈయాచరణములకు మార్పుకలుగవలెనన్న—మనము జేయునదేదియుఁ గానరాదు. ఇందులకుఁ గాలమే తనతీర్పును జెప్పవలెను!—ఆకాలము సమీపించునరికి యివన్నియును జక్కఁబడును. ఇట్లని—ఈకాలమే న్యాయాన్యాయవిచక్షణకు సమర్థతగలిగిన దనియెంచి మన

మూరకుండరాదు! మనము జేయుప్రయత్నములను మనము జేయుచునే యుండవలెను! ఈకాలము జెప్పుతీర్పు, మనప్రయత్నములపై నాధారపడి యుండును. యువరాజా! ఈపఠానులిట్లు చెలరేగి దుష్టకార్యములను జేయుచున్నారుకదా! ఈపాపకార్యాచరణంబుల నణచివేయుటకు మనము బ్రయత్నించినచో, వారికుపాకార్యంబులకు గమ్యస్థానము లేకపోవును.—

జగ—ఈవర్షాగమమును గతించువరకు నీకూరులదుర్మార్గముల నాటంకపరుప మాతండ్రిగారియొద్ద ప్రతినబూని, కొలఁది సైనికులతో నిందు రహస్యముగా వర్తింపుచు జాలవరకీపఠనుల దుర్మార్గంబుల నణచివైచితిమి! పఠానులకుఁగూడ ధైర్యకంచుకము సడలినదని మనమనుకొనుచుండ నీనూతనసైన్యాగమముఁజూడ నాప్రతిన నెఱవేరునాయని నాకు సందియమగుచున్నది?

ధర్మ—జగత్సింహా! ఎన్నఁడును లేనిదిగులును జెందెదవేల? సుక్షత్రియధర్మమునకు వ్యతిరేకించి మాటలాడెదవేమి? ఈపఠాను లింతమందికాదు—ఇంతకు వేయినూర్లరుదెంచినను మనము మనక్షత్రియధర్మమును బరిపాలింపవలెను.

జగ—(చిరునవ్వు) ధర్మసింహా! నాకు నూతనముగా నీతులఁ గఱపుచుంటివేమి?—కార్యాలోచనకై యట్లంటి—

ధర్మ—కార్యాలోచన కేమున్నది! ఎటుఁజూచినను యొక్కటే సమంజసముగా నున్నది.

శా, శూరత్వంబున నీపఠానుఖులులన్ ♦ శోధించి ఖండింపగా
ఘోరంబైనప్రతిజ్ఞఁబూని యటవీ ♦ కూటంబులన్ జొచ్చితే;
కూరత్వంబునఁ గొరవుల్ కుటిలతన్ ♦ గూటంబుసల్పంగ నా
మాచాకారుఁడు నర్జునాత్మజుఁడు ప ♦ ద్మవ్యూహామునఁ జీల్చడే!

ఇంతకంటె వేరుకార్యాలోచన మేమియు లేదు!—

జగ—బాగు—ధర్మసింహా! చక్కగాఁ జెప్పినాడవు!—(అని చేతిలోఁ జేయివైచి) ఇటులనినము—

చ. ముదమున నేగిశత్రువుల ♦ మూకలఁ బిందరవందరౌగతిన్
కదనములోఁ బఠానులను ♦ ఖండనజేసి కలంచివైచెదన్—
మదగజయూధముల్ చెలగ ♦ మాన్కొని, సింహకిశోర మొక్కటే
విదళనజేయదే చటుల ♦ భీకర మైనప్రతాపమొప్పగాన్.

ఇదియే నానిశ్చయము! ధర్మసింహా! ఇక నీవేగి, చారుల నియమించి, ఈనూతనశత్రుసమాచారంబుల నరయుము.

ప్రవేశము: సైనికుఁడు: ప్రణామము:
ఒకయుత్తరమును జగత్సింహునకిచ్చి వేచియుండును.
జగత్సింహుఁడు లేఖను జదువుచుండును.

ప్రవేశము: వీరేంద్రసింహుఁడు: ఒకచెట్టుక్రింద

జగ—(ధర్మసింహుని సాభిప్రాయముగాఁ దిలకించును.)

ధర్మ—(లేఖనందికొని, చదివి జగత్సింహునిఁజూచును.)

జగ—ఈవీరేంద్రసింహుఁ డోరిస్సాదేశవాసి కాదా?

ధర్మ—(సందేహము) ఔను!—

జగ—ప్రస్తుత మీతఁడు పఠానులరాజ్యములోనివాఁడు. మనకీసహాయపత్రమును వ్రాయుటలో నీతనియుద్దేశ మేమైయుండును?

ధర్మ—ఈపఠానదురహంకారాగ్నిజ్వాల లీతనిసంస్థానము పైఁగూడఁబ్రసరించుచున్నవేమో! —అయినను గనుగొందము—

జగ—నీయుద్దేశమే సరియైనయెడల మనము వానికి సహాయము చేయవచ్చునా?

ధర్మ—ముఖ్యముగా—ఇంకను సందేహమేమున్నది?

జగ—(సైనికునిజూచి) ఎచ్చట నున్నారు?

సైని—ఆన్నకృత్యాయ చేయుచున్నారు. ప్రభూ!

జగ—వెంటనే వారి నిందుఁబ్రవేశపెట్టుము. పొమ్ము.

సైని—చిత్తము (వెనుకకు నడచిపోవును)

ప్రవేశము : వీరేంద్రసింహుఁడు.

జగత్సింహుఁ డెదురేగి వీరేంద్రుని సన్మానించును.

జగ } (సాభిప్రాయముగా వీరేంద్రునిఁదిలకింతురు.)
ధర్మ }

వీరే—జగత్సింహా! నీవాశ్చర్యము నొందబనిలేదు. నే నొరిస్సా దేశవాసినైనను, ప్రస్తుత మీపఠానుల రాజ్యములోనివాఁడ నైనను, స్వజాత్యభిమానము— స్వదేశరక్షణ— ధర్మస్థాపన— దేశభక్తి— పాపవిధ్వంసము—ఇవి నన్నుఁ బ్రోత్సహించుటచే నిందువచ్చితి.

జగ—మీదేశమున నందరకుఁ గుశలమా?

వీరే—(ఆవేశము) కుశలమా!—ఎంతకాల మీపఠానులుజెల రేగి, యడ్డులేక, విచ్చలవిడిగా సంచరించుచుందురో—ఎంతకాల మీపతనదురహంకారాంబుదంబుల కీరాజపుత్రశౌర్యప్రభంజనము తగు లకుండునో—అంతకాలమువఱకు నన్ను మీరు కుశలప్రశ్న వేయనగ త్యము గానరాదు!

ధర్మ— ప్రభూ! మీరాపఠానుల రాజ్యములోనివారలేకదా! మీరాజ్యమునకుఁగూడ నధర్మములు, అన్యాయములు జేయుచున్నారా?

వీరే—నేనీయొరిస్సాదేశవాసినైనంతమాత్రమున వారికి సామంతుఁడనా? అదిగాక, కృపాపరులకు స్వ పర విచక్షణ—యుక్తాయుక్తనిరూపణ—కలుగునే?

జగ—ధర్మసింహా! ఎచ్చటఁజూచిన నీపఠానులదుండగములే వినవచ్చుచున్నవి!

వీరే—జగత్సింహా! వారిదుండగముల నేమనివచింతును! ఈ పఠానుల హతమార్చ మీరు దండెత్తినసంగతిఁ దెలిసికొని, నన్ను నా సైన్యముతోఁ దనకు బాసటగావచ్చి, మీతోడ యుద్ధముఁ జేయవలసినదిగా వ్రాసి ఖుతల్ఖానుఁడు నాకొకహుకుమును బంపెను.

జగ—(ఆశ్చర్యముతో) హుకుమును బంపెనా? మీరు స్వతంత్రులుకారా?

వీరే—(ధీరత) సర్వస్వతంత్రుఁడను!—ఈహుకుమును జారీచేయుటలోనే యాఖుతల్ఖానుని ధార్ష్ట్య మగుపడుచున్నది!

ధర్మ—మీరందుల కంగీకరించినారా?

వీరే—(బొమముడిపాటు) అంగీకరింతునా? క్షత్రియుఁడనుగానా?—ధర్మాధర్మము లెఱుఁగనా?—జగత్సింహా! ఈకౄరులదుర్మార్గంబుల నన్నిటి నెఱింగినవాఁడనౌటచేతను, మాతృభక్తి—జన్మహక్కు—స్వదేశరక్షణ—దుష్టశిక్షణ—నన్నుబ్రోత్సహించుటచేతను, నేనువారలకు సహాయముఁజేయ నని నిర్భయముగాఁ జెప్పితిని.

జగ—(చిరునవ్వు) బాఁగు; బాఁగు; మంచిపనిఁ జేసినారు!

వీరే—అందుల కాతఁడుగినిసి, నాగరమందరదుర్గమును ధ్వంసముజేయుదు ననినాకువర్తమాన మంపె!

జగ—(కోపము) ఎంత యన్యాయము!—

వీరే—అంతటితో నూరకుండెనా?—ఇప్పుడీపఠానులు నాదేశము పైఁబడి చేయు దుర్మార్గములకు మేర లేకున్నది! కటకటా!

సీ. ఎదపైన హస్తంబు ♦ లిడి హాయి నిదురించు
జనులగొంతులఁ గోసి ♦ చంపినారు;
తల్లుల స్తన్యముల్ ♦ ద్రావుపిల్లలలాగి
చెట్టుల కురిఁదీసి ♦ చీల్చినారు;

నవమాసవతులైన ♦ యువతీమణులఁబట్టి
పొట్టలపైఁ బోట్లఁ ♦ బొడిచినారు;
పతిహీనలౌ మాన ♦ వతుల రచ్చకుఁదెచ్చి
బల్మిమై యవమాన ♦ పఱచినారు;

గీ. కఠినమతులౌచు నిండ్లను ♦ గాల్చినారు;
కుటిలులై దేశములఁ గొల్ల ♦ గొట్టినారు;
గర్భనిర్భేదకంబులౌ ♦ కలుషములను,
వేనవేల్ జేసినారు ప ♦ ఠానులకట!—

జగ—(మిక్కిలికోపము)

వీరే—ఇకనూరకుండనగునా? జగత్సింహా! దయలేక—దాక్షిణ్యముఁదలుపక—అసూయాభావమూని—దుర్మార్గమునకు వెరువక—ఇచ్చవచ్చినరీతి మెలంగు నీదేశద్రోహుల—ఈధర్మవిధ్వంసకుల నుపేక్షింపఁదగునా? పాపపరిహారమునకుఁ బాటుపడవలదా?—ధర్మస్థాపనకై తనువుల నర్పింపవలదా?—దేశక్షోభమునడంప దివ్యాస్త్రములఁ బూనవలదా?—సంతాననాశనంబుచే సంతాపించు భారతాంబ దుఃఖమును బాపవలదా?—

జగ—(ఆవేశముతో) మహాశయా! (చేతిలోఁజేయివైచి) అందులకు నేను సంసిద్ధుఁడను—నేనీయరణ్యములఁ దిరుగునదికూడ అందులకే—మహాశయా! చెప్పుఁడు!—నేనేమిచేయవలయునో చెప్పుఁడు!—

వీరే—జగత్సింహా!—మన మిప్పుడేవిధముగానైన నీపఠానుల హతమార్పవలెను—

ధర్మ—ఇప్పుడు మేముజేయుచున్న పనికూడ నయ్యదియే!

వీరే—ధర్మసింహా! నిజము. అయిన నిందువలన సంపూర్ణజయము లభించునా? ఏదైన నొకయుపాయముచే వీరలను జయించవలెను.

లేనిచో దుస్సాధ్యము. మన మేది జేసినను సుస్థిరతరముగా నుండునట్లు జేయవలె ననినా యభిమతము!

ధర్మ—(ఆలోచన) ఆయుపాయ మేదియో మీరే సెలవిచ్చిన చోఁ గర్తవ్యమునూహింపవచ్చును.

వీరే— నేనిప్పు డిచ్చటకరుదెంచిన విషయముగూడ నదియే!

జగ—మహాశయా! మీయభిప్రాయ మేదియో సెలవీయ వేడెదను.

వీరే—జగత్సింహా! ఈపఠాను లీప్రాంతంబులకుఁ దండోపతండములుగా దిగుచున్నవారు; వారందరేకీభవించి, ఏనాఁడో నాగరమందరమును ముట్టడింపక మానరు—సమయమెఱిగి నేను మీకు వార్తనంపెదను! మీరు మీసైన్యముతో నరుదెంచి వారలను వెనుకవైపునఁ దాకుఁడు! నేనును నాసైన్యముతోఁ గోటద్వారములఁ దెరచి వారిపైఁ బడుదును. అప్పుడు మనకుఁ జయము కరతలామలకము! పఠాను లందరొక్కసారిగా మడియఁగలరు!

ధర్మ—బాగుఁగా నున్నది!

వీరే—ఇది నాస్వార్థమున కనిమీరెంచరాదు! దేశక్షోభము నడంప నావిధియైనందున మిమ్ములఁ బ్రార్థింపవచ్చితిని—

జగ—ఇప్పుడీపఠానులబలగ మెంతగలదో మీకుఁదెలియునా?-

వీరే—సుమారేబదివేలవరకు నుండును—

జగ—(ఆలోచించి) ధర్మసింహా! మనబలగ మైదువేలుకదా!—

ధర్మ—చిత్తము. (వీరేంద్రునితో) మీసైన్య మెంత?

వీరే—నాలుగువేలు మాత్రము!

ధర్మ—(సంకోచము) మన మీకొలదిసైన్యముతో వారలఁ బ్రతిఘటించి నిలువగలమా యని-నాకు-సంది- - - -

వీరే— అవిషయమై మీరనుమానింప నగత్యము లేదు. ఏలనన—

గీ. దివ్యవర్షాగమమున, న ♦ దీజలంబు
పొంగి, పొరలుచు వచ్చియు ♦ లొంగిపోదె?
చిన్నచిన్నవికొమ్మలు ♦ కొన్ని చేరి,
గట్టుగా నడ్డువడియెటు ♦ గదలకున్న!

అదిగాక, మనరాజపుత్రుల శౌర్యసాహసంబులందును, వారి రణకౌశలమందును నాకు సంపూర్ణవిశ్వాసము గలదు!— ఏమందురా!

సీ. ఒకచేయివిఱుగ, నిం ♦ కొకచేతఖడ్గంబు
దాల్చి శత్రులమేనఁ ♦ జీల్చువారు;
ఒకకన్ను చెడిన, నిం ♦ కొకకంట గురివెట్టి
యరిశిరంబులను జెం ♦ డాడువారు;
ఒకకాలు తెగిన, నిం ♦ కొకకాలఁ గుంటుచు
వైరికోటిని జేరి ♦ పోరువారు;
ఒకపార్శ్వమూడ, నిం ♦ కొకపార్శ్వమున లేచి
ప్రతికక్షులఁ గలంచి ♦ వైచువారు;
గీ. ప్రాభవోపేతులౌచు స్వ ♦ రాజ్యమునకు
స్వేచ్ఛగాఁ బ్రాణములను న ♦ ర్పించువారు;
విలయభీకరవిస్తార ♦ వీరయశవి
భూషితాంగులు సూ! రస ♦ పుత్రులనగ!

ఇట్టిరాజపుత్రసింహంబులకు, పఠానుసృగాలంబు లన్నియు నేకమైవచ్చి నను బరాజయము సంభవించునే! కల్ల; కల్ల;

జగ—(సంతోషముగ) మహాశయా! మీయిష్టప్రకారమే జరుగుఁగాక! మనమీపఠానులతోఁ బోరుసల్పులోపల నాజనకుఁ డగు

రాజామానసింహభూపాలుఁడుగూడతనసైన్యముతోవచ్చి మనలకు సహాయము జేయునటుల నేర్పాటుఁగావించెదను.

వీరే—ఇది మఱియుబాగున్నది!—జగత్సింహా! మనధర్మంబుల మఱువరాదు సుమా! ధర్మసింహా! ఏమరుపాటున నుండకుఁడు! జాగ్రతది. ఇంక నేనరుగుదునా?

ధర్మ—మనమందర మొక్కసారి జయగీతిని బాడి వెడలిపోదము.

జగత్సింహుఁ డీలవేయును—సైనికు

లరుదెంతురు—అందరునుగలసి జయ

గీతిని బాడెదరు.

నిష్క్రమింతురు.

ప్రథమాంకము.





శ్రీ రామచంద్ర

# ఆయేషా

ద్వితీయాంకము.

రంగము : శిబిరము

ప్రవేశము : ఆస్మన్ ఖాన్

ఆస్మన్—(రోషకషాయితావలోకనము: ఆవేశము) ఆఁ—మరలబరాజయమా?—ఈపఠానులకుఁ బరాభవమా?—నిరుపమానధైర్యసాహసలోకవిఖ్యాతయశులగు నీపఠానులకుఁ బరాభవమా?—(కోపము) దురాత్ములగు నీరాజపుత్రాధములరహస్యసమరంబుల నింకను నాసైనికు లడంపజాలరైతిరిగదా! ఛీ!—ఛీ!—నాసైనికులింకను దయదాక్షిణ్యములఁ జూపుచున్నారు. బుద్ధిలేదు. జ్ఞానములేదు. రసపుత్రులను కనిపించినచోట నఱుకవలెను—చీల్చవలెను— చంపవలెను. పాతిపెట్టవలెను—ముక్కముక్కలుగఁగోసి కాకులకును గెద్దలకును వేయవలెను—దయపనికిరాదు—దాక్షిణ్యము పనికిరాదు—(పండ్లుకొరుకుట) అక్బరు!— అక్బరు!—పాపుఅక్బరు!—ఈతఁడు చక్రవర్తియఁట! కడున్యాయస్థుఁడట! అన్యాయముగఁ బరుల రాజ్యమపహరించుట న్యాయమా?—కానిమ్ము. ఈతనిదౌష్ట్య మెంతవఱకుఁ గొనసా

గునో జూచెదను! (ఇటునటుబరికించి) రహీమా నింకనురాడేమి ? ఈ జగత్సింహునిజాడ తెలిసినదేమో! తెలిసినయెడల వానినిపట్టి బంధించెదనుగాక!. అపుడు మానసింహుఁ డేమిచేయునో చూచెదను. అక్బరేమిచేయునో చూచెదను— మాయిష్టప్రకారము జగత్సింహునికొరకైనను మారాజ్యము మాకీయకపోవునా?—అక్బరుజగత్సింహుని విడచిపుచ్చునా?—మానసింహుఁడు తనయేకపుత్రుని వదలుకొనునా?—

(ఆలోచన)

ప్రవేశము : రహీమాన్ ఖాన్.

రహీ—(వంగుచు) సలా మాదబ్ —

ఆస్మ—రహీమాన్ ! వార్తలేమి ?

రహీ—బలే మంచీమంచి షంగతూల్ తెల్సింది—

ఆస్మ—జగత్సింహునిజాడఁ దెలిసినదా?

రహీ—మస్కీ- చారుల్ నాకీసెప్పిందీ—జీ !

ఆస్మ—ఏమి చెప్పినారు ? త్వరలో చెప్పుము.

రహీ—ఆ రాజ్ పూత్ పిల్లావాన్కీ- చూచిందీ అని—

ఆస్మ—బద్మాష్ ! తిన్నగా చెప్పుము.

రహీ—తుఁకీ నిన్నా వచ్చిందీ కాదూ—

ఆస్మ—అవును. అయిన నేమి?

రహీ—నిన్నా పాయింత్రిం మల్లి—మల్లి— ఆ రాజ్ పూత్ ని చారుల్ సూసింది—

ఆస్మ—బద్మాష్! నీమూర్ఖతను వదలి తిన్నగాఁ జెప్పెదవా?—చెప్పవా?—(రహీమాన్ చెవులనలుపును.)

రహీ—(బాధనటియించుచు) సెప్తా—నిజం సెప్పీయేస్తా—

ఆస్మ—చెప్పుము. ఏమిజరిగినదో చెప్పుము.

రహీ—నిన్నాపాయిత్రిం మస్కీ- చార్ల్ సెప్పీయేశార్ —

ఆస్మ—(విసువుతో) తుచ్చుండా!

రహిం—హిక్కడ్కి, ఆసెట్టూయెన్కా హిందూవాలామసీద్ వుంది తెల్సీ, చాకుల్ హక్కడ్కిగయా! హక్డా హారాజాపిల్లావాన్ని మన్కిచారుల్ సూసింది—హాఁడిదగ్గాఱి ఇంకా దోసక్కడ హాఁడ్ పిల్లా వాళ్లు—(అనిఎక్కువసంతోషము)

ఆస్మ—(ఆశ్చర్యముతో) స్త్రీలా!

రహిం—హద్గదీ—హాఁడావాడూ—హీద్దర్—

ఆస్మ—వారెవ్వరు?

రహిం—హందూలో సిన్నావాడు హీ౦గేందర్ సింగ్కి పిల్లా—తిల్లమ్మా—పెద్దావాడూ తిల్లమ్మాసఖ—బీమల్—ఆహాఁడావాడు తిల్లమ్కి మొగాదీ రాజ్ పూత్కి, స్నేహంహక్డా—(నవ్వును.)

ఆస్మ—స్నేహమా? వారేమిమాట్లాడుకొన్నారు?

రహిం—స్నేహంటాక్టే కాదూ! హాఁడావాడు మొగదాన్కి సూచీ బలేబలే హాఁబుషాక్ సే—సిందీ—

ఆస్మ—వారేమిమాట్లాడుకొన్నారు?

రహిం—బీమల్ రాజాపిల్లావాడ్కి సెప్పిందీ—తిల్లమ్మా హాన్ని సూచి పెల్లిసేస్కుండీ అని—

ఆస్మ—పెండ్లిజరిగినదా?

రహిం—లేదూ—పెల్లి సేస్కుందామని—

ఆస్మ—తరువాత?

రహిం—ఆహాఁడామనిసీలు గరిమందంక్కి హెల్లిపోయిందీ—రాజ్ పూత్ పిల్లావాడ్కి హెక్కడోక్కి యెల్లిపోయింది—

ఆస్మ—మఱలవారెప్పుడు సమావేశమయ్యెదరో తెలియునా?

రహిం—హీరోజ్కి రాత్రి మల్లిమల్లి హాఁడాదీవాళ్లు హక్డామసీద్ కి వస్తుందీ—రాజాపిల్లావాడూ వస్తుంది—హక్డా తిల్లమ్మా రాజాపిల్లా

వాడ్కీ- ప్యారీ (సంతోషము) హిందీ హీరేందర్ సింగ్‌కీ మూలుంనహి-

ఆస్మ—(ఆలోచన) రహిమాన్! మంచివార్త నెఱింగించినాడవు! గాని నీవీతక్షణమేగి, మనకొత్తసేనలో నైదువందలసిపాయీలను నీసాయింకాలము పెందలకడనె గరమందరదుర్గసమీపారణ్యమున నేరికినిఁ దెలియరానివిధమున డాగియుండు మనిచెప్పుము. నేను స్వయముగావచ్చి వారల కుత్తర్వుల నొసంగువరకు మిన్నకుండు మనిచెప్పుము. రెండవది, ఈరేయి ఆస్త్రీ లిరువురు నానియమితస్థలమును చేరకమునుపే మనసైనికులను గొంతమందినిబంపి వారిని బంధించి నాశిబిరములోఁ జేర్పు మని చెప్పుము. పొమ్ము.

రహి—హిత్తం (వెడలిపోవును.)

ఆస్మ—రహిమాన్!

రహి—(తిరిగివచ్చిప్రశ్నార్థముగా నాస్మనుఖానుని జూచును.)

ఆస్మ—ఆయేషాసర్కార్ యెచ్చటనున్నారు?

రహి—శిబిరంలో షుఖంగాహున్నావార్—

ఆస్మ—ఆస్త్రీల నాయేషాసర్కార్ శిబిరములోనికిఁ దీసికొని పొండు! ఈసంగతి నామెతోవిన్నవింపుము.

రహి—హిత్తం (వెడలిపోవును.)

ఆస్మ—(ఎక్కువసంతోషము) ఇంక గరమందరము రేపుదయమునకు నాచేతిలోనుండును. జగత్సింహామత్తవేదండము రేపుదయమునకు నాశిబిరములో నినుపశృంఖలాబద్ధమై పడియుండును. నేనే స్వయముగాఁబోయి ఆరాజపుత్రుని బంధించెదగాక! వారె—షహాబాష్!—ఈప్రణయసమావేశమున కావీరేంద్రునితనయ దుర్గమునుండి రహస్యమార్గమున వచ్చితీరవలెను. ఆమెబయిటికరుదెంచుమార్గము నాచారులకుఁ దెలియకుండునా?—ఆమార్గముననే నేనాగరమందరములోఁ బ్రవేశించి ఈరాత్రియే, కోట నతిసులభముగా వశముగావించుకొని వీరేంద్రుని బంధించెదనుగాక! ఇంక నాప్రయత్నము లెం

దుకు సఫలత్వము నొందవో జూచెదఁగాక! సూర్యోదయమునకు మాకు సంపూర్ణవిజయ మెందులకుఁ జేకూరదో జూచెదగాక!

ఈల వేయును. పఠాను సైనికులరు
దెంతురు. అందరును దీన్ దీన్
అనుచు నిలుచుందురు. అందరును
గలసి అల్లా, ఇలాహా, ఇల్లల్లాహా,
అని దైవమును బ్రార్థింతురు. ఆ
స్మర్ఖాను కవాతును జెప్పును.

రెండవరంగము : అరణ్యము.

ప్రవేశము: విమలాతిలోత్తమలు,
పఠాను లాస్త్రీలను ముట్టడింతురు.

తిలో—(భయముతో) హా! జగద్రక్షకా! (మూర్ఛఁబోవును)

సైని—(కోలాహలము. తిలోత్తమను సమీపింతురు.)

విమ—(తిలోత్తమను గాపాడుచు) హా! పరమేశ్వరా! అబలలమగు మమ్ములరక్షించువార లెవ్వరునులేరా?—హా!—హా!—రక్షింపుఁడు! రక్షింపుఁడు!

ప్రవేశము : జగత్సింహుఁడు పరివారముతో-
పఠానులకును రసపుత్రులకును సంకులసమరము.
ఆయేషా యొకవృక్షచ్ఛాయనుండి జగత్సింహుని
దిలకించి విభ్రాంతినొందుచుండును. పఠాను
లంతమొందెదరు. జగత్సింహుఁడు తనపరి
వారమును చేసన్నచే నవలకుఁబంపివేయును.

జగ—విమలా ! మీరాజపుత్రి భయోద్రేకముచే మూర్ఛ నొందియున్నది. జలమును దెచ్చెద నిటభద్రముగానుండుము. భయము లేదు. (వెడలిపోవును.)

ఆ యే—(వృక్షముమాటుననుండి జగత్సింహునిఁ దిలకించి) ఏమి యీవీరశృంగారము ! (యువ్విళు లూరుచుండును.)

జగ—(జలముతోఁ బ్రవేశించి తిలోత్తమముఖముపైఁ జల్లును.)

తిలో—(మూర్ఛఁదేరి మేలిముసుఁగుసవరించుకొని విమలచాటు న కేగి క్రీగంటిచూపులఁ జూచుచుండును.)

జగ—విమలా! ఇప్పటికిఁ జాలమేలయ్యె !

విమ—ఇదంతయు నాపైలేశ్వరుని యాశీర్వచనమే!

జగ—పఠానులు కొత్తమైనికుఁ లరుదెంచినారని నేనెచ్చటికే గినను నావెంటఁ గొంతమందిశరీరరక్షకులఁ దీసికొనిపోవుచుందును. అటులనే మిమ్ములఁ గలసికొనుటకు నేనిప్పు డాలయమునకుఁ బోవుచుండ నీయార్తారవము వినిపించినది. అందుచే సమయమునకరుదెంచి మీకు సహాయముఁ జేయఁగలిగినాను.

విమ—అయ్యా ! మీకెంతయు మేము ఋణపడి యున్నారము! అందులకుఁ బ్రత్యుపకారము మేమేమిచేయగలమో నాకుఁ దోపకున్నది! (తిలోత్తమను దిలకించి) ఏమమ్మా! తిలోత్తమా! సిగ్గుపడి వెనుకకుఁ జేరెదవేమి? ఇంక సిగ్గెందులకు? ఇటు రమ్మా ! (చేయి బట్టుకొని ముందునకు లాగును)

జగ—(చిరునవ్వుతో ముఖమవ్వలకుఁ ద్రిప్పుకొనును.)

విమ—రాజపుత్రా! మారాకుమారి మిమ్ములనుజూచిన వేళావిశేషమో— ఆమెపూర్వజన్మపుణ్య ప్రతిఫలమో—మిమ్ములను గాంచినప్పటినుండియు మిమ్ముల-వ-ల-చి-యున్నది. రాకుమారా! ఇంక

దాపరిక మెందులకు? —ఈమె మిమ్ముఁబరిణయమాడి సుఖింపవలెనని కోరుచున్నది. అంబరయువరాజా! ఇంక నీపెకోరికను మన్నించి—

సీ. ధరకెల్లఘనసూత్రి ♦ ధారి కాలమనీషి
శ్రుతులఁబల్కెడు పురో ♦ హితుఁడు గాఁగ
సన్మార్గగాములౌ ♦ చందురిండు తారకల్
దరినుండు పెండ్లిపె ♦ ద్దలును గాఁగ
పండుటాకులు జేయు ♦ చుండు మర్మరశబ్ద
జాలంబు తూర్యని ♦ స్వనము గాఁగ
బలుమార్గగోచు మీ ♦ పరిణయంపుజూడ్కులు
ప్రోధితమౌ పెండ్లిసూ ♦ త్రింబు గాఁగ
గీ. విటపిభూమియె పెండిలి ♦ పీట గాఁగ
లతలబూవులు మంగళా ♦ క్షతలు గాఁగ
ప్రమదచంద్రిక లెల్లహా ♦ రతులు గాఁగ
దరినిజేర్పుము నీపె గాం ♦ధర్వవిధిని!

(తిలోత్తమచేతిని జగత్సింహునిహస్తమున బెట్టును)

ఆమె —(తెల్లబోయి శిరోవేదన నభినయించును.)

విమ—తిలోత్తమా! ఇంకనుసిగ్గెందులకు?

జగ—విమలా! ఈరాజపుత్రిసౌందర్యాతిశయము మిగులఁ బ్రశంసనీయమైనది సుమా! ఏమన—

చ. ఉవిదను నేనుజూచినము ♦ హూర్తమదెట్టిదో? నామనంబులోఁ
బ్రవిమలమైనప్రేమ ప్రభ ♦ వంబయి కోర్కెలు క్రొత్తలొప్పె; నే
డవిరళమైన సౌఖ్యమును ♦ నందితి; * * *

(లోపలినుండి)

జగత్సింహా! ప్రస్తుతకార్యమును మరువరాదు! దుర్మార్గులీరేయి నెల్లెడల సంచరింపుచున్నారు! త్వరపడుఁడు!

జగ—(గట్టిగా) వచ్చుచున్నాను. ఈయువిదలకు భయము దు పుచున్నాను. (విమలవైపుదిరిగి పూర్వోక్తపద్యమును బఠించును.)

* * * * గాన గ్రహింతునిప్పుడే

దివిజులుసంస్తుతింప సుద ♦ తీమణి పట్టమహిషిగాఁ దగన్!

(తిలోత్తమచేతఁ జేయివేయును.)

విమ—(ఆనందము.)

తిలో—(ముగ్ధత్వము.)

ఆయే—(శిరోవేదన.)

జగ— ఇంక జాగుసేయరాదు! పోదము రండు.

విమ—జగత్సింహా! దైవయోగమువలన నీశుభము సమకూడి నది. సమరానంతరమువఱకు వీరేంద్రసింహుని కీవార్త నెఱింగింప నగ త్యములేదు. మీరు విజయలక్ష్మిని జేకొన్నతమువరి, సమస్తయోగముల మీాయిరువురకు యథావిధిగఁ బెండిలియగును.

(లోపలినుండి)

జగత్సింహా! ఆలస్యము వలదు.

జగ—ఇక పోదమా?

విమ—(భయము) మేమింటికి కరుగవలదా?

జగ—(ఆలోచన) ఔను. అయిన నడువుఁడు. మిమ్ముల మీాదు ర్గమువరకు సాగనంపెదను. (లోపలికిఁ జూచి) ధర్మసింహా!

ప్రవేశము: ధర్మసింహుఁడు.

జగ—ధర్మసింహా! నేనీయువిదల భద్రముగా వారికోటవరకు సాగనంపివచ్చెదను. మీారందరకుజాగరూకులరై యుండుఁడు.

ధర్మ—ప్రభూ! అర్థరాత్రమున నొంటరిగాఁ బోరాదు. నేను కూడ మీాకుఁదోడువచ్చెదను.

జగ—వలదు. నేనిప్పుడే వచ్చెదను. మీరు భద్రముగా నుండుడు.

ధర్మ— (నిష్క్రమణ.)

జగత్సింహ, విమల, తిలోత్తమలు నిష్క్రమింతురు.

వెంటనే

ప్రవేశము: ఆయేష

చెట్టుచాటునుండి

ఆయే —(దీర్ఘనిశ్వాసము) ఆహా! ఏమి యీ మనోవికారము!— ఏమి యీహృదయచాపల్యము! —ఏమి యీసత్వదౌర్బల్యము! —ఆహా! నాహృదయ మెన్నడెఱుఁగని యీనూతనవికారమునకుఁ గుఱియై పోయిన దే! —సకలశాస్త్రపఠనలభ్యనీతిదాయకం బగు నాహృదయము—సర్వశుభలక్షణోపేతం బగునాహృదయము — సర్వజగద్విలసితాఖిలసుందరపూరుషాలోకనాద్యసంచలితం బగునాహృదయము — సంతతబ్రహ్మచారిణ్యాభిలాషితం బగు నాహృదయము—దృగ్భయంకరాందోళితభూరిభీభత్సితసమరవీక్షణాహ్లాదితం బగునాకర్కశహృదయము— నేఁడిట్టినూతనావస్థను బొందుచున్న దే!—ఏమిది!— ఈనూతనావేశమునకుఁ గారణ మేమైయుండును?— కేవల మీసుందరపూరుషాలోకనమేనా? —ఈజగత్సింహ సుందరమూర్తి సందర్శనమేనా? — (ఆలోచన)-ఛీ! — ఛీ! —నిఖిలభువన మోహినీహృదయహార సౌందర్యధురీణులగు యువకు లెంతమంది నాదృక్పథమునఁ బడ లేదు!—వారీజగత్సింహునికంటె సౌందర్యవంతులుగారా? —నాహృదయమప్పుడు చలించినదా? (ఆలోచన) కాదు: కాదు. ఈహృదయావేశమున కీయువకుని వీరకృత్యములె కారణములు! — ఈసుకుమారుని సాహసకృత్యములే కారణములు!— ఈక్షత్రియవీరుని నిరుపమానరణవిన్యాసమే

గారణము! — నేను వీరపుత్రిని- వీరపుత్రికి వీరకృత్యము లింపో సంగవే! —(ఆలోచన-కోపము) అయ్యో!-ఏమి నా విభ్రాంతి! ఏమి నాచపలత్వము! ఈజగత్సింహుఁ డెవ్వఁడు! నాతండ్రిశత్రుఁడు కాఁడా? నా శత్రుఁడు కాఁడా? మాపఠానుకులధ్వంసముఁ జేయఁబ్రతిన బూనినవాఁడుకాఁడా! అట్టిమావంశద్రోహిని — మాకులపరిధ్వంసకుని — మారాజ్యవిధ్వంసకుని — ఉపేక్షింపఁదగునా! — ఏమి నా వెఱ్ఱి! — నేనా? — జగత్సింహునా? ప్రేమించుటయా? — ఛీ —! ఛీ — ఎన్నటికిని గాదు! — కల్ల! కల్ల! నావిధ్యుక్తధర్మమును మఱచుచున్నాను! నేనీయరణ్యములఁ బ్రవేశించినకారణమును మఱచుచున్నాను!-(పండ్లు పటపట గొరుకుచు) ఈరసపుత్రులను మారణము జేయించెదను! — ఈదుర్మార్గులను నాక్రోధాగ్నికి శలభములుగఁ జేసి వైచెదను! —(నిర్వేదము) అయ్యో! నాహృదయము నాస్వాధీనము గాకున్నది! ఆవిధముఁ జేయఁజాలను! — ఈజగత్సింహునిజూచిన వేళావిశేషమో? నా హృదయ మీతనియందు లగ్నమైపోయినది! నాహృదయక్షేత్రమందు బ్రణయబీజము గాఢముగా నాటుకొనిపోయినది — నేనీవీరసుందరు నకు వ్యతిరేకమేమియుఁ జేయఁజాల! నేనాతని వశమైపోతిని. నాహృదయము నాస్వాధీనము దప్పిపోయినది. నావిధ్యుక్తధర్మమును మఱచినను సరియే — నారాజ్యము పోయినను సరియే — నే నేమైపోయినను సరియే — ఆజగత్సింహునే ప్రేమించెద! — ఆదివ్యపురుషునే వివాహ మాడెద! ఆవీరసింహునే నా బాహువుల బంధించెద! ఇదియే నానిశ్చయము! — (స్మృతి—విచారము) అహా! ఏమిచేయుదును? ఆవీరునకు వివాహమైపోయినదే! ఆతిలోత్తమ యెంతయదృష్టవంతురాలు! ఒక తెను హృదయానందముగఁ బరిగ్రహించినయాతఁడు నన్నంగీకరించునా? అయ్యో! ఏమిచేయుదును? ఆతని నెట్టులసమ్మతింపఁజేయఁగలను? (దీర్ఘాలోచన) నాప్రాణవల్లభుని నేనిప్పుడేవిధముగఁ గలసిమా

ట్లాడగలను? (దీర్ఘనిశ్వాసము : ఆలోచన : చిరునగవు : చేతులుముకిళించుట: ఆనందము) సరి! ఈయాలోచనమే బాగుగనున్నది!—ఇప్పుడీముప్పురును గరమందిరమున కేగుచున్నారుకదా! నేను మాయాస్మనుఖానుతో నచటికేగియెట్లైన వారలను బంధించెదగాక! దైవమనుకూలుఁడైనచో గరమందిరముకూడ మాస్వాధీనము కాగలదు! —(కులుకు) అప్పుడు నామనోహరుని నాసన్నిధినే యుంచుకొనెదను —నాప్రాణవల్లభునకుఁ గోపమువచ్చిన బ్రతిమాలుకొందును — నేడికొందును — పాదములపైఁబడి ప్రార్థించెదను —

సీ. ధీరనాచు గరమం ♦ దిరదుర్గపతనంబు
స్థిరతరంబుగను సా ♦ ధించుదాన;
సాధించి, దుర్గేశు ♦ బాధించి, స్త్రీలతో
హృదయేశు బంది జే ♦ యించుదాన;
జేయించి, విమలాది ♦ స్త్రీజనంబులకెల్ల
వివిధసౌఖ్యముల ని ♦ ప్పించుదాన;
ఇప్పించి, విభుని నా ♦ యింటఁజేర్పించి లా
లించి ప్రార్థించి బో ♦ ధించుదాన;
గీ. జీవితేశ్వరుఁ బ్రేమ బూ ♦ జించుదాన;
ప్రణయసుమమాలికల వానిఁ ♦ బట్టుదాన;
తేటి దుర్గేశుతనయుఁ బ్రా ♦ ర్థించుదాన;
ఈడుజోడుగ విభుఁ బెండ్లి ♦ యాడుదాన!

నేనిప్పుడే వారిని వెంటాడించెదనుగాక! (నిష్క్రమణసూచన)

ప్రవేశము : అస్మన్ ఖాన్.

అస్మన్—ఆయేషాసర్కారే! ఈరాత్రిసమయమున నొంటరిగా నిందుంటివేల?

ఆయే——ఈవిమలాతిలోత్తమలను బట్టింప నేతెంచితిని——

ఆస్మా—— అయినమీరు రానేల? సైనికులు లేరా? ఆ దురాత్ములు మిమ్ముఁజూచిన నేమిచేసియుందురో?

ఆయే——అబలలను బాధించునంతటి దుర్మార్గులుగారీ రాజపుత్రులు!

ఆస్మా——(ఆశ్చర్యము)

ఆయే——ఇచ్చటివిషయము లేమైననీకుఁ దెలిసినవా?

ఆస్మా——(ప్రశ్నార్థము)

ఆయే——మనప్రయత్నములన్నియుఁ బ్రస్తుతము విఫలములయి పోయినవి. కాని యంతకంటె ఘనమైనయాలోచన యిప్పుడొకటి నాకుఁ దోచుచున్నది.

ఆస్మా——(ఆతురత : ప్రశ్నార్థము)

ఆయే—— (రహస్యము) విమలాతిలోత్తమలతో జగత్సింహుఁడు గరమందిరదుర్గమునకుఁ బోవుచున్నవాఁడు. బహుశః నాతఁడు గూడ వారలతోఁ గోటలోఁ బ్రవేశించునని తోచుచున్నది.

ఆస్మా——విమలాతిలోత్తమలు గోటనుండిబయట కేతెంచిన మార్గమును జూచి చారులువచ్చి నాకుఁజెప్పినారు.

ఆయే——అట్లయిన మరియుమంచిది. ఇఁక నాయోజన వినుము. (ఆస్మా చెవిలో రహస్యము.) ఇఁక సడుపుము. ఆలసింపరాదు.

ఆస్మా——(సంతోషము : నిష్క్రమణ)

ఆయే—— (వెంబడించును)

ద్వితీయాంకము





శ్రీరామచంద్ర

# ఆయేషా

## యాంకము

రంగము : గరమందిరదుర్గసమీపారణ్యము.

ప్రవేశము : విమలాతిలోత్తమలు : జగత్సింహుఁడు

ఒకవైపున ఆస్మనయేషాలు, రహస్యముగా—

జగ—విమలా! ఈపార్శ్వమున నేదియో యలుకుడగుచున్నది. మీరిందాగుఁడు! నేనాదెసకేగి పరికించివచ్చెదను. (పరికించును.)

తిలో—మఱలఁ గష్టములాయేమి?

విమ—భయమేమి? ఈరాజసింహము మనపట్ల నున్నదికదా! అయినను, ఇంకె రెండునిమిసములలో మనము గోటలోనుందుము.

తిలో—(తలవాల్చి) మనమి - రు-వుర-మేనా-(ముగ్ధత్వము.)

విమ—(నవ్వుచు) నీయభిప్రాయము నాకుఁదేటపడినది! ఆ సంగతి నన్నడిగెద వేమి?—ఆతని నీవే ప్రార్థింపుము—

తిలో—(సిగ్గు : కపటకోపము : అనవతముఖము.)

విమ—పోనిమ్ము! నేనే ప్రార్థించెదను లే!

జగ—(మఱల< బ్రవేశించి) విమలా! దూరమున నావృక్షము క్రింద నిరువురుపఠానులు గూరుచున్నవారు! ఈకరవాలముకంటె, ఇప్పు డొక్క భల్లముండినc జాలనుపకరించును కదా!

విమ—అయిన మీరిందుండుcడు. నేను గోటలోని కేగి భల్లమును దెచ్చెదను. (నిష్క్రమణసూచన)

జగ—విమలా! ఈమెనుగూడ లోనికిcగొనిపొమ్ము! నేనొక్కcడనే వారలc గనిపెట్టుచుండెదను.

విమలాతిలోత్తమలు కోటగోడను సమీపింతురు: విమల తనచీరచెరగున ముడిచైచిన యొక తాళపుచెవిమూలమునc గోటగోడలోనమర్పబడిన యొకద్వారమును దెరచి,లోని కేగి, తలుపును దగ్గరగావైచును : జగత్సింహుcడుపఠానులను గనిపెట్టుచుండును : మాటునవేచియున్న ఆస్మత్ఖానుcడును, ఆయేషాయు, రహస్యముగాcగోటలోc బ్రవేశించి, ద్వారమునుదగ్గరగావైచియొక మూల డాగియుందురు : విమలభల్లముతోc బ్రవేశము.

విమ—జగత్సింహా! భల్లమిదిగో.

జగ—(భల్లమునందుకొని గురిచూచి పఠానులను వేయును. వారుపడియుందురు. తిరిగివచ్చి) విమలా! వారు మరణించినారు! ఇంక నీవు లోని కేగుము. అర్ధరాత్రము సమీపించినది. నేను పోయెదను.

విమ—(చిరునగవు) జగత్సింహా! ఏగుమురుగాని నాదొకప్రార్థనమున్నది.

జగ—అదియేది?

విమ——మీరొకసారి మా కోటలోనికి దయచేసి మా తిలోత్తమ మందిరమును బావనము జేసి ఆమె యభిప్రాయమును బ్రత్యక్షముగా విని వెంటనే-యే-గ-వచ్చును. ఇదియే నా ప్రార్థన---

జగ——(ఆశ్చర్యము) విమలా! ఇది యెట్లుసంభవ మగును. అర్ధరాత్రమున నబ్బీను మువ రాజు సరియైనయాహ్వానము లేకుండ పరుల దుర్గమున దొంగతనముగాఁ జొరనగునా?

విమ——మీకా సందేహ మక్కర లేదు. నేనే మిమ్ముల నాహ్వానించుచున్నాను.

జగ——తప్పు. తప్పు. నీవొక పరిచారికవు. నీయాహ్వానము సరియైనది కాదు.

విమ——జగత్సింహా! మీకా సందియమక్కర లేదు. (అని జగత్సింహుని చెవిలో నేదియో రహస్యముగాఁ జెప్పును.)

జగ——(విస్మయము. నమ్రత) తల్లీ! తప్పుటభిప్రాయము నొందితిని. క్షమింపుము. ఊరూపరేఖావిలాసములఁ జూచుచుండియుఁ బ్రమాదమందితిని. తల్లీ! ఇంక నడువుఁడు వచ్చెదను.

విమల ద్వారమును దెరచి లోనఁబ్రవేశించును.

జగత్సింహుఁడు వెంబడించును.

విమల మరల దాళమును వెచి లోనికేగును.

ద్వితీయరంగము : దుర్గములోనొక భాగము.

కేశము : విమల.

విమ——చిత్రము! ఎక్కడి జగత్సింహుఁడు—— ఎక్కడి తిలోత్తమ! శైలేశ్వరపూజాతత్పరులమై యాలయమునసుండనీరాకుమారుని

సందర్శనలాభ మొదవె! మా రాకుమారియు నా యంబరయువరాజును గాంచి యెన్నడు నెఱుంగని ప్రణయభావము వహించెనుకదా? ఆహా! ఏమి యీజగన్నాథుని కల్పన! ప్రథమసందర్శనమునె మా రాకుమారి విరహోత్కంఠితయై నిద్రాహారముల విసర్జించి, తుదకీనాఁటి రేయి తన యభీష్టసిద్ధి నొందెనుగదా! ఈప్రణయసూత్రమున జగత్సింహుఁడు మాయందఱమై యీపఠాన్‌పరాభవమునకుఁ దోడ్పడు గాక!—ఆహా! ఏమి యీవీరవరేణ్యుని తనూవిలాసము—

ఉ. ఈతనిరూపసంపదల ♦ నెంచుచు నీమె తదేకదృష్టిగా
నీతనిఁజూచుచుఁ తనువు ♦ నేమఱి తన్మయతన్ మెలంగెడున్
రాతిరి వెన్నెలల్ బయలు ♦ రాగఁ జకోరములుల్లసిల్లుచుఁ
జేతలుదక్కి తూలుచును ♦ జేరుచు సోలుచు నుండు కైవడిన్—

అందులకే మాతిలోత్తమ మోహాతిశయము! ఎంతయానందము! ఈసరికి మాతిలోత్తమ తనహృదయవల్లభునితో నిష్టాగోష్ఠిని ముచ్చటించుచుఁ తనహృదయగతాభిప్రాయములను వెలిబుచ్చుచుండును. (స్మృతి) జాఁగైనది. మరలనా రాకుమారునిఁ దోడ్కొనిపోవలయుఁగదా! ఇంకఁ బోవలయును. (నిష్క్రమణ : లోపలధ్వని : మరలబ్రవేశము) ఎక్కడిదీశబ్దము? (పరిశీలన)

ప్రవేశము : ఆస్మన్ ఖాన్.

ఆస్మ—(ఖడ్గధారణ — నిశ్శబ్దప్రవేశము— విమలభుజముపై హస్తమునునిచి నిశ్శబ్దమని సౌంజ్ఞ)

విమ—(చకితయై, దూరముగఁ దొలఁగి, బొమముడిపాటు) నీవెవ్వఁడవు? ఇచ్చటి కెట్లువచ్చితివి?

ఆస్మ—నేనెవ్వఁడనైనదియు నాయుడుపులేఁ దెలియఁజేయుచున్నవి. ఇటువినుము. నేను నీతోఁ గార్యార్థినై వచ్చినాఁడ. అధిక ప్రసంగముఁ జేయఁబూనినచో నిన్నీక్షణమందే నఱికివైచెదను.

విమ—(తనలో) ఇదే మిట్లనుచున్నాఁడు? ఈతనితీరుఁజూడ నీతఁడొక పఠానునివలెఁ దోచుచున్నాఁడు. (భీతి) అర్ధరాత్రము—శత్రుపక్షము—భీరచిత్తము—ఇంక నెంతమందిపఠానులిందుఁ బ్రవేశించిరో? సంగతి నరసెదగాక! (ప్రకాశము) నీవిచ్చటి కెట్లువచ్చితివి? నీ పేరేమి?

ఆస్మ—నేను నీయనుగ్రహమున నే యిచ్చటికిఁ జేరితిని. నా పేరాస్మర్‌ఖాన్; పఠాను నాయకుఁడ!

విమ—(ఆశ్చర్యముతోఁ దనలో) నాయనుగ్రహమా! ఇందు నాప్రమాద మేమియుఁగానరాదు. అయిననేమి? సందర్భములనరయుచుఁ గొంతకాలయాపనఁ జేసెద. ఈలోపున నేపహారావాఁడయిన నిందుఁ బ్రవేశించిన వానికీపఠసాధమునిఁ బట్టి యిచ్చెదగాక! (కోపము) వీనిని విడిచిపుత్తునా!

ఆస్మ—నీవేదియో నాలోచించుచున్నావు. నన్ను విడిపించుకొని పోవుటకు నీకు సాధ్యముకానేరదు.

విమ—మీ రెంతమంది యీదుర్గమునఁ బ్రవేశించినారు?

ఆస్మ—ఇరువురము—

విమ—ఎందులకు?

ఆస్మ—ముందు నీకే తెలియఁగలదు—

విమ—శత్రుదుర్గమునఁ బ్రవేశించుటకు భీతిలేదా?

ఆస్మ—దుర్గమును స్వాధీనముగావించుకొనునపుడు భీతియుండునా?

విమ—(అదిరిపడి — తనలో) దుర్గస్వాధీనమా! ఇఁక నూరకుండ రాదు. (ఇటునటు పరికించుట)

ఆస్మ—కాలయాపన మగుచున్నది.

విమ—నీకేమి కావలయును?

ఆస్మ—(విమలచీరచెరఁగును జూపుచు) అచ్చటముడివైచినఁ దాళపుచెవి నిటుఁదెమ్ము.

విమ—(అదిరిపడి తనలో) తాళపుఁజెవియా? చాలపెద్దయూ హాయే! నామేనఁ బ్రాణములుండునంతవఱుక వీనికి దీనినిత్తునా?

ఆస్మ—ఏమి యాలోచన?

విమ—మీరిందలి కెట్లుఁబ్రవేశింపఁ గలిగినారు?

ఆస్మ—నీ వింతకుముందు భల్లముఃకొఱకు కోటలోనికేగి నపుడు గుప్తద్వారమును బంధింపమఱచుటచే మాఆయేషాసర్కార్ తో నే నిందుఁబ్రవేశించితిని—

విమ—(దీర్ఘముగరచిదీర్ఘనిశ్వాసము.) ఆయేషాసర్కా రెవరు?

ఆస్మ—మాప్రభ్వి—సుల్తాన్ ఖతల్ ఖాన్ ఏకపుత్రిక! (విమలనుఁ జూచి) నీవలన నుపకారమునొందినవాఁడనౌట నీసౌశీల్యమునుఁ గాపాడుచుంటిని. ఇంకనాలసించిన బలాత్కారమున నైననా కార్యసాఫల్యమును జేసికొందును. (హస్తముఁజాపి) తాళపుఁజెవి నిచ్చెదవా? నీయవా?—

విమ—(తాళపుఁజెవిని చేతికిఁదెచ్చుకొనుచు దనలో) పహారా వాఁడు గానరాఁడు. కార్యముమించునట్లున్నది. (తాళపుచెవిని దూరముగావిసరివేయును.)

ఆస్మ—(మధ్యమార్గమున వానినిఁ బట్టుకొని విమలతో) నీవు నిజముగ ప్రత్యక్షరాక్షసివి. నిన్నువిడచినఁ గోటలోనల్లరిఁజేయుదువు. (విమలను పట్టుకొనఁ బోవును.)

విమ—(భయవిహ్వలచిత్త యగును.)

ఆస్మ—(విమలఁనుబట్టియొక స్తంభమునకుఁ జేతులవిరచిఁగట్టుచు) ఓనరపిశాచీ! నీవున్నడతకుఁ దగినఁ ఫల మిదియే! ఇంక నీవేమియుఁ జేయఁజాలవు. నేనిచట్టుపక్కలనే నుందును. కోకరిత్తినచో నిన్ను ముక్కముక్కలుగఁ జీల్చివైచెదను. (నిష్క్రమణము.)

విమ—(విచారోద్రేకము) అయ్యయ్యో! ఎట్టిగతి సంప్రాప్తించినది? నేఁడ నేనింతయవివేకినినైతి నేమి?—నేనింతమతిమాలినదాననైతి నేమి? హా!—జగద్రక్షకా!—నే నేమి చేయుదును?—ఈదుర్మార్గుఁ డిప్పు డాగుప్తద్వారముఁ దెరచి శత్రుబలముల నిందుఁ బ్రవేశ పెట్టి యీదుర్గమును స్వాధీనముఁగావించుకొనునుకాఁబోలు. అకటకటా! నేఁడెట్టిదుర్దినము ప్రాప్తించె!—అయ్యో! గరమందరమా! నేఁడు నామూలమున నిష్కారణముగ దుర్మార్గుల హస్తగతం బగుచుంటివా?—సనాథవయి యుండియు— భూరిబలసమన్వితవయి యుండియు— మందభాగ్యురాలగు నీపిశాచినిమూలమున నన్యులవశము కానుంటివా?—అయ్యో! యేమిచేయుదును! కేకలువైచి దుర్గములోనివారల మేల్కొలుపుదమన్నను, యీభాగము నిర్మానుష్యము కదా! (ఆలోచించి మరింతదుఃఖముతో) కటకటా!— నాప్రాణనాథుఁడు—నాజీవితేశ్వరుఁడు-నాహృదయవల్లభుఁడు-అయ్యో! -అయ్యో!-ఈదుష్టులచేఁ జిక్కునుగాబోలు!- నేను నావిభు నెట్లురక్షించుకొనఁ గలుగుదును?—నాదుర్గేశుని యీపఠానులబారినుండి యెటులఁ దప్పింపఁజాలుదును?— ఓజగదీశ్వరీ! నేఁడు మాపై నీకింత నిర్దయతఁ గలిగినదేమి? నీవైన నాదుర్గేశుని—నాప్రేమదుని మేలుకొల్పుము—అయ్యో! కటకటా! (విచారముతో నిటునటుఁ బరికించి) అయ్యో ! పఠానులొక్కొక్కరే నాగుప్తద్వారమునఁ బ్రవేశించుచున్నటుల నున్నది ! హా!—హా!—వారేమి చేయుదురో?—అయ్యోగరమందిరమా!—నేఁడు నాప్రాణేశుని వీడిపోవుచుంటివా? (మరియొకయాలోచన : పైకేడ్చుచు) అకటకటా ! జగత్సింహుఁడే!—ఏపాపమెరుగనిజగత్సింహుఁడే!— ఈపఠానులదుర్మార్గములఁ బలాపంచలుగఁజేయఁ బ్రతినబూనిన వాఁడే!—అయ్యో!—నిష్కారణముగ—నిరపరాధముగ— మందభాగ్యురాలనగు నామూలమున—పఠానుల వశమైపోవును గదా! ఓతిలోత్తమా!— ఓదుర్గే

శనందినీ!— నీయదృష్టముగూడ నీతీరున నున్నదా?— (చికాకు) ఇంతకును కారణమును నేను—జగత్సింహుఁడు మమ్ముల నింతవరకు సాగనంపి వెడలిపోదు ననిచెప్పినపుడు పోనీక దుర్గప్రవేశము జేయించినదానను నేను—గుప్తద్వారమును బంధింప మరచినదానను నేను—అన్నిటికి కారణమును నేను—(ఉన్మాదము) నేను—నేను—నేనా?— ఈకాలపిశాచము నన్ను మ్రింగివేయునా'—(వికటపునవ్వు) నేను చచ్చిపోను— నేను మరణించను— నేనుబ్రతికియేయుండెదను—నేను జీవించియేయుండెదను —నేను పఠానులనుధ్వంసముచేసెదను—పఠను రాజ్యమును నాశనముచేసెదను.—(స్మృతి : విచారోద్రేకము) అయ్యో! ఏమిచేయుదును?—నావిభున కీవార్త నెటులనెరింగింపగలను? జగత్సింహునీదుర్గమునుండి యేవిధముగ దాటింపగలను? హా! దైవమా!

సీ. కాలమా! భవదీయ ♦ కరుణార్ద్రదృష్టుల
బ్రసరించవేమి మా ♦ పైని నేఁడు?
న్యాయమా! నీవుమా ♦ యందు గోపముగల్గి
తప్పినావేమి ని ♦ర్దయత నేఁడు?
అవివేకమా! నీవు ♦ నతిముదంబునవచ్చి
చేరినావేమి న ♦న్గోరి నేఁడు?
చైతన్యమా! నీదు ♦ సౌజన్యమునువీడి
తొలఁగెదవేమి న ♦న్నలచి నేఁడు!
గీ. వాడిరేమి సత్యమా మమ్ము ♦ వీడ నేఁడు?
వేగరావేమి ధైర్యమా ♦ వెంట నేఁడు?
నామనోహరు, జామాత ♦ నాసుపుత్రిఁ
బ్రోవరావేమి దైవమా ♦ నీవు నేఁడు?

అయ్యో! నేనెంత మొఱలిడినను లాభమేమి? ఏయుపాయంబుచేతనయిన నీబంధవిముక్తినొందితినేని నేనే స్వయముగా నీదుర్గమును ర

క్షింపగలను. (కోపముతో) ఈపఠానుల ధ్వసంముచేయఁగలను—ఇం దులకుఁ బ్రతీకారమును జేసితీరుదును. బ్రతీకారము—శత్రువిధ్వంస ము—కఱ!—కఱ!—(ఇటునటుపరికించి : కోపముతో) అయ్యో! దుర్మార్గులుప్రవేశించుచున్నారు. ఏమిచేయుదురోచూచెదను! రాని మ్ము—

ప్రవేశము : అస్మన్: రహీమాన్ : పఠాను

సైనికులు.

అస్మ—(విమలను జూపి) రహీమాన్! నీవీపరపిశాచినియొద్దఁ గాపుండుము. ఈమె చేతులువిదళించుకొనఁ బ్రయత్నించినను, కేకలు వేయ నోరుమెదపినను వెంటనే, ఆలోచించక, ఈమెను నిలువునఁజీల్చి వేయుము. సందేహింపకుము. ఈలోపున మేము వీరేందుని బంధించి తెచ్చెదము. జాగ్రత! ఈమె కడునేర్పరి! (రహీమాన్ చెవి నలుపుచు) ఇప్పుడైనను నీమూర్ఖతను విసర్జించుము. (నిష్క్రమణ)

రహీ—(అస్మాన్ ఖాన్ను వెంబడించి దీనముగా) జీ! మన్కీ- కోఁ ఫాదీసంపేపింది మెన్కా, హాఁకీ యిహ్లిమే ఫ్యారీ-ఊఁ—

అస్మ—(నగవు) నాయాజ్ఞను బాలింపుము. నీకోర్కె నెర వేర్చెదను. (అస్మన్, సైనికులు, నిష్క్రమణ)

రహీ—(విమలను వారచూపులఁజూచుచు పహారా నిచ్చు చుండును.)

విమ—(భయము : స్వగతము) ఈదుర్మార్గుఁడు నన్నుగాంచి మరులుగొన్నవాఁడు. నన్నిప్పు డేమియు నల్లరిఁ జేయఁడుకదా? (ఆలో చన) ఈతఁనిజూడ కొంచెము తెలివిహీనునివలెఁదోచెడిని. ఈతని నెట్లు లైనఁదప్పించుకొని నాప్రాణేశ్వరుని రక్షింపఁబూనెదనుగాక!... .ఏమి చేయుదును? (ఆలోచన : దరహాసము) సరి—ఇఁకనేమి? ఈతఁడునన్ను వలచి యున్నాఁడుకదా!......నాయొద్ద నాసౌందర్యదివ్యాస్త్ర మున్న దికదా! నాపాతివ్రత్యమునకు భంగమురాకుండ నాదివ్యాస్త్రమునే

వీనిపైఁబ్రయోగించి, యీపతనాధముని దప్పించుకొని, నాపా రుని, నాదుర్గమును, మీదుమిక్కిలిజగత్సింహునిఁ గాపాడెదను గాక! ఇంతకన్న వేరొండుపాయంబెద్దియు నాతలంపునకుఁ జిక్కకున్నది. (దీర్ఘా లోచన : స్మృతి) అయ్యా!

రహీ—(శరీరముజలదరింప నిటునటుఁజూచును)

విమ—అయ్యా! మిమ్ములనే—

రహీ—(ఆతురత) క్యా? తుమారా నాకీపిల్సింది? జల్దిబోలో,

విమ—అవును. మిమ్ములనే. మీపేరేమి?

రహీ—(భుజముల విదళించుచు) మేరానాం రహిమాన్ ఖాన్‌జీ! క్యా? మేరానాం, తుంకీ, కైకు?

విమ—రహిమాన్‌ఖాన్‌జీ! పాపము మీరు చాలశ్రమనొందు చున్నారు.

రహీ—మాకీ బహూత్ షుఖమ్‌హై. షరమానై—

విమ—లేకేమి? మీశరీరమంతటను జెమట యేలాపట్టినదో చూడుఁడు. పాపము—

రహీ—(శరీరమును జూచికొని వికటముగానవ్వుట)

విమ—ఖాన్‌జీ! మీరనవసరముగ నేల శ్రమనొందెదరు? మీ రు కొంచెముసే పచ్చటఁగూర్చుండుఁడు. మిమ్ములనుజూచిన నాకుజాలి యగుచున్నది.

రహీ—(భయము, నాలుకఁ గరచుకొనుట) మాజేమాలోం, మైభెట్నాసే, తుంకీ గడ్బిడ్ సెప్పి కాల్కిబుద్ది శెప్పి యెల్లిపోతావ్.

విమ—ఎంతమాట! మీయందు నాకు సదుద్దేశముఁగలుగుటచే మీబాగునుగోరుచు నిట్లంటిని. కాని నేనుకేకలువేసినయెడల మీకత్తి లేదా? నన్ను వెంటనేఁ జంపవచ్చును.

రహీ—(తృప్తి: సంతోషము) దీస్కిసెప్పింది నిజమ్ (కత్తిని

పార్శ్వమున నిడుకొని విమలను వారఁజూపులఁ జూచుచుఁ గూర్చుం డును.)

విమ—(కొంత సేపూరకుండి) సాహేబుగారూ!

రహీ—సాయిబుగారూ! హామేరానాంకి రహింమూన్ ఖాన్ జీ. నీకు షెప్పిండీ లేదూ?

విమ— (చిఱునవ్వు) మరచితిని ఖాన్ జీ! మిమ్మొక ప్రశ్న వే యుదునా?

రహీ—(స్వగతము: సంతోషము) దీన్కీ బలేరంగూరంగూ వాలాగా హుండీ—(ప్రకాశము) జల్దీబోలో—

విమ—పోనీ యెందులకులెండు!

రహీ—బోలో—బోలో—నాకీజబాబ్ షెప్పీయేస్తాన్.

విమ—(చిఱునగవు: ఇటునటు బరికించుట) మీకు పెండ్లి యయినదా? యని—

రహీ—(స్వగతము) దీన్కీ బహూత్ షోకీవాలా! ఇదీ బహూత్ హాచ్చా షమ్యం. దీన్కీ హామేరాయుద్దేషమ్ షెప్పూయేస్తాన్

విమ—ఏమిటి యాలోచించుచున్నారు?

రహీ—(స్ఫురణ) నాకీ పెండిల్ గిండిల్ నహీం. ప్యారీ నై. హాంకీ నిఖా లేద్.

విమ—పాప మటులనా? (విచారాభినయము)

రహీ—క్యా? క్యారే?—

విమ—మీకు భార్యయున్న యెడల నీసమయమున మిమ్ములవిడ చియుండగలదా? మీభార్యవంటిదానను నేనేఅయినయెడల యిట్టిరాత్రి మకు మిమ్ములవిడచి నేనొక్కనిముషమైనను మీయెడబాటును సహింపగలనా?

రహీ—(సంతోషము) వారే! దీన్కీ హాచ్చాబాత్ షెప్పీయే

న్తోంది—దీస్కీ మైఉపర్ అచ్ఛా హుద్దేషం హుందీ లాగా హుందీ—(విమలదగ్గరకు జరుగును.)

విమ—రహింమాన్‌ఖాన్ జీ! నేనే మీభార్యనైనయెడల మీకీవి ధముగఁ జెమటపట్టుచున్నపుడు నేనూరకుండగలనా ?

రహిం—(సంతోషాతిశయము : మరింతదగ్గరకు జరుగును.)

విమ—(నగవు) నిజము చెప్పమునా? నేను మిమ్ములను జూచి నప్పటినుండియు—ఉఁ—ఊఁ— —

రహిం—(తొందరతో లేచి) క్యా? క్యా? బోలో, అచ్ఛాబోలో.

విమ—చెప్పుదునా? నిజము చెప్పుదునా? మిమ్ములను ప్రే-మిం-చు-చున్నా-ను-

రహిం—(ఎగిరిగంతులువేయుచు) అహ్హాహాహ్హాహ్హాహా ! నాకు సి మీదహదీహుద్దేషంహుందీ—హాచ్ఛా,అచ్ఛా సీఖ్, మైప్యారీఖీ, సీఖా నేనుకుంటామ్.

విమ—(వానిమూర్ఖతకునవ్వుచు) మీకుఁ గొంచెమువిసరుదునా? నాకు జాలియగుచున్నది - - - - పోసీలెండు. నేను పారిపోవుదునని మీకు భయమున్నదేమో ?

రహిం—(స్వగతము) దీస్కీ నామీద భ లేనిఖాహుస్తే. హిదీ యు ఖ్కడ్కీ పోతుందిజే ? అరే! పారిపోతే నక్కీయాస్తామ్. (ప్రకాశము) హాంకీసీమీదషందేహాంలేదు. నీకీ షేతుల్ కి లంఖనిఖాలు సెస్తాన్. (అని విమలచేతులను విప్పి) అర్ రే! దీస్కీ షేతుల్ హెరాత్రిహెరాత్రిగా ఖందీపోయినాయ్. మైయల్లా—

విమ—నాచేతుల కేమిలెండు. మీరుకూర్చుండుఁడు. విసరెదను.

రహిం—(సంతోషముతోఁ గూర్చుండును.)

విమ—(నిలబడి తనచీరచెరఁగుతో విసరుచుతనలో) ఇప్పటి కి బంధవిముక్తినొందఁ గలిగితిని. ఇఁక వీని నెట్లైనను దప్పించుకొని పోవ

లయును. ఈతఁడు నామాయామోహపాశంబుల బద్ధుఁడై యున్నవాఁడు. ఏమిచేయుదును?—(ఆలోచన : చిరునగవు) ఈతనికీసమయమున జగత్సింహుఁడింటను న్నాఁడనియు, మానసింహభూపాలుఁ డుదయమున కీపఠానులఁ జుట్టుముట్టుననియు నమ్మించి వీనివానలకుఁ దోలి వేసెదనుగాక!

రహీ—ప్యారీ! మన్కీ రేపే నిఖా సేస్కుందామ్—

విమ—(దీర్ఘనిశ్వాసము)

రహీ—క్యా? నీకీమొఖం చిన్నాపోయింది?

విమ—ఏమియు లేదులెండు.

రహీ—బోలో; బోలో; నాకు సెప్పింది లేదూ, నాకీ మర్గయా అయిపోతుందీ.

విమ—మీక్షేమమునకు సంబంధించిన రహస్యమొకటి నాకుఁ దెలియుటచేఁ జెప్పఁదలచియు నది మీకును తెలిసినవిషయమేమో యని యూరకున్నదానను.

రహీ—(ఆతురత: లేచి) హూదీ పేనుమ్? - క్యా? మాదీ పే. నుమ్?—బోలో—

విమ—అవును. మీక్షేమసమాచారమే! జగత్సింహుఁ డీదుర్గమున కొంతసేనతో మిమ్ము నెదుర్కొన డాగియున్నవాఁడు. ఉదయమునకు వానితండ్రివచ్చి మనలఁ జుట్టుముట్టును.

రహీ—(భయముతో) క్యా?—క్యా?—బోలో?—

విమ—(మఱల చెప్పును)

రహీ—తుమారెవో భైరో. నాకీ ఆస్మాన్‌జీకి పెప్పివస్తుందీ. తుమారె నాకీ హచ్చహచ్చ ప్యారిహై. ఆస్మాన్‌జీకి హింది పెస్తే బహూత్ యీనామ్ నాకీ తెస్తాయి. (పోఁ బోవును.)

విమ—(అడ్డువెళ్లి) నేను మిమ్ములవిడచియుండలేను. నాకు భయమగును. మనమిరువుర మిప్పుడే యీకోటనుండితప్పించుకొని పారి

పోదమురండు! తెల్లవారిన యెడల మనమందరమును మానసింహునిచే మడియవలసియుండును. రండు! మిమ్ములం బోనీయను. (అడ్డముగ నిలచును.)

రహి— అరేమైంఅల్లా! నాకే యిప్పుడేవస్తుంది. మాఆస్మాక్ జీకి చెప్పి హిస్తేవస్తుంది బే!—(పారిపోవును)

విమ—(తనలో) ఇప్పటికీపిశాచము వదలినది. అకటా! యీ పాటికాదురాత్ములు నాస్వామియగు వీరేంద్రసింహుని బంధించియుందురు. నేను జగత్సింహునియొద్దకుం బరుగిడిపోయి తిలోత్తమాజగత్సింహులనైన రక్షింపం బొటుపడెదనుగాక! —(రెండడుగులువైచి) ఆహా! కాలమున కెంతవక్రత్వము కలుగుచున్నది. నిరుపమానధైర్యవిఖ్యాతయశులగు నీరాజపుత్రవంశంబునజన్మించి మహావీరుండగు వీరేంద్రసింహుని యర్ధాంగినై, సర్వసంపదలం దులందూగుచు, కాలవశమున నీపతాను సైనికునితో— హేయమగు—అప్రస్తుతమగు —విరుద్ధమగు మోహావచనంబుల నుగ్గడించి, యనుచితముగ వర్తింపవలసివచ్చెగా! కటకటా! భారతజననీ! నీసంతానమునకా యిట్టికష్టములు?—(ఆలోచన) ఏమి? నేనిప్పుడాచరించినది యనుచితమా?—అప్రస్తుతమా?—విరుద్ధమా?—ఎన్నిటికినికాదు. ఏమష్టకృత్యముల నెఱుంగక సర్వసౌఖ్యముల విలసిల్లు నారాజ్యము నీదుర్మార్గులబారినుండి రక్షించుటకు—ఎట్టికష్టములందలంపక గుండియలపైంజేతులిడుకొని హాయిగానిదురించు నాప్రజలను రక్షించుటకు—నాజీవనిధానమగు నావీరేంద్రసింహుని రక్షించుటకు దుష్టశిక్షణపరాయణుండగు జగత్సింహు నీక్రూరులనుండిం దప్పించుటకు—నేనగ్నినైన నుఱికెదను—నాశరీరమును చిన్నచిన్నముక్కలుగ నఱికి అర్పింపవలసిన నర్పింతును!— నాపాతివ్రత్యమునకుమాత్రము భంగమురాకుండ నేనేమిచేసినను చేసియేతీరుదును. ఇంతకు నానిజస్థితిని

మరుగుబరచు నాయీపరిచారికా వేషముకూడ యీకృత్యమును జేయ గొంతసాహసింప జేసినది. ఓజగదీశ్వరీ! నీసంపూర్ణప్రేమను నాపైఁ బరపుము. (పరుగిడి పోవును)

తృతీయరంగము : తిలోత్తమశయ్యాగారము

జగత్సింహుఁడు : తిలోత్తమ.

జగత్సింహుఁడు శయ్యపైఁగూర్చుండియుండును.

తిలోత్తమపార్శ్వమున దూరముగా నిల

చియుండును.

జగ—ఆవిషయమై సందియమక్కఱలేదు! (అని మూరుమొగము బెట్టి చిరునవ్వు నవ్వుచుండును.)

తిలో—మీ-కా-ధై-ర్య-మున్నది కాని—

ఉ. ఎందరుసుందరుల్ తమహ్రా ♦ దీప్సితముల్ నెఱవేర దాము మీ
సుందరరూపవర్ణనలఁ ♦ జూరలఁ బారలఁ బొందుచుండురో!
బంధనతోడ నెవ్వరి వి ♦ వాహ మొనర్పఁగ మీదుతండ్రి మీ
కుందలపోయునోయనుచుఁ ♦ గొందల మగ్గలమయ్యె నామదిన్.

మఱియు మీరు మీజనకునియాజ్ఞ నుల్లంఘింతురా? మనగాంధర్వవివాహమువిషయమై మీజనకున కెఱింగింప నెవ్వరుసాహసింపఁగలుగుదురు? ఒకవేళ మీజనకున కీవిషయము దెలిసినను ఈసంబంధమున కామహారాజీయకొనునా? జీవితేశ్వరా!—నాకన్నివిషయంబుల సందియముచే పొడసూపుచున్నవి.

జగ—ప్రియా! నీ కిట్టిసందేహములు పుట్టుచున్నవేమి? నీసందేహంబులన్నియుఁ గారణరహితంబులు. నీవెన్నడు నిట్టివిషయంబుల ని

మదిని బ్రవేశింపనీయకుము! వినుము! మఱలఁజెప్పుచున్నాను. అబ్బీరు ప్రభుఁడు నాతప్పులనన్నిఁటిని క్షమించితీరును. ఒక వేళ నీరహ్యాసమా నే శమాతనికిఁ దెలిసి నాపయిఁగినిసినను నాపక్షమునఁబలికి నానిర్దోషత్వ మును మాతండ్రిహృదయంబున స్థిరపరుపఁజాలెడు మాధర్మసింహుఁడు న్నాడు. ఆతఁడు బుద్ధిలో నప్రతిమానుఁడు. మాలో వృద్ధుఁడు. ఆతని మాటలయందు మాజనకునకు సంపూర్ణవిశ్వాసముగలదు. ఆధర్మసిం హుఁడు నన్ను దనపుత్రసమానునిగాఁ జూచుకొనును. ఇఁక నీయను మానము దీరినదా! ఇఁక నావిషయము వినుము—

సీ. అనిశంబు మనలఁబా ♦ యకఁ బ్రేమది నెంచు
        నై లేశ్వరుఁడు గొప్ప ♦ సాక్షిగాఁగ
    బవలురాత్రియు నేక ♦ భంగి మింటనుదోచు
        సూర్యాదిచంద్ర సా ♦ క్షులుజెలంగఁ
    కృపతోడ జగముల ♦ నెపుడు రక్షింపంగఁ
        జాలు పవనుఁడొప్పు ♦ సాక్షిగాఁగ
    బ్రతిలేని భాగ్యసం ♦ పదలనొప్పెడి మీాదు
        సామ్రాజ్యలక్ష్మియే ♦ సాక్షిగాఁగ
గీ. బంచభూతాత్మకంబయి ♦ పరగు ధాత్రి
    సాటిలేనట్టిదా గొప్ప ♦ సాక్షిగాఁగ
    బెండ్లియాడితి నిన్ను నే ♦ ప్రేమదలర
    విడతునేనిన్ను బ్రేయసీ ♦ భీతియేల?

(అని తిలోత్తమహస్తము బరిగ్రహించును.)

తిలో— (జగత్సింహునిపాదములకడఁ గూరుచుండి) జీవితే శ్వరా! ధన్యనైతి! నాజన్మము పావనంబయ్యె! ఇంకనా కేవిచార మును లేదు!

జగ—(తిలోత్తమను లేవదీసి తనప్రక్కగా శయ్యపైఁగూరు

చుండఁజేసి) ప్రాణేశ్వరీ! నీవు నన్నింతగాఁబ్రశ్నించితివి కదా! నేను బురుషుఁడను! నేనెట్టులైనఁజేయఁగలను! నీ వబలవుకదా! నీవుస్వతంత్రించి చేసినయీపనికి మీతండ్రిగా నంగీకరింతురా? జనకునిసమ్మతిలేనిదే తనయ స్వతంత్రించి రహస్యముగా నొకనినివివాహమాడిన లోకాపవాదమునకుఁ గారణభూతమౌనుగదా!

ప్రవేశము : విమల

విమ—(ఏడ్చుచు ద్వారమునందుండి పొంచి యీదంపతుల సంభాషణ నాలకించుచు దనలో) అయ్యో! ఏమిచేయుదును? ఈను కుమారులు దామన్యోన్యప్రేమైకసంభాషణంబులకాలంబుఁ బుచ్చుచున్నారు! కటకటా! నాకుఁజావైన రాదేమి! నేను వీరియనురాగంబునకు-ప్రతిబంధమౌనో? న్యాయానురాగంబునకు విఘ్నమాపాదింతునా? అయ్యో! నాకేమియుఁ దోపకున్నది! పాపము వీరల కీసమయంబున బయిటనేమి జరుగుచున్నదో తెలియదు! అయ్యయ్యో! నేనీభయంకరవార్త నీప్రియస్వరూపుల కేవిధముగా నెఱింగింపగలను? కట్టా! హాదుర్విధీ! తుదకు వీరిసౌఖ్యమునకుఁగూడ నేనేప్రధ్వంసకురాల నౌచుంటినికదా! అయ్యో! హాదైవమా!

ఉ. లోఁముదమంది, కూరిమి తి ♦ లోత్తమసత్ప్రణయంబుఁబెంచి, మా
   క్షేమము నెంచి, యీజగతి ♦ సింహునిఁ బెండిలిఁజేసి; యీపయిక
   బ్బీమహనీయుఁదెచ్చి, మన ♦ ధీశుని, నల్లునిఁగూతుశత్రువు
   ష్కాములకిచ్చునాకిపుడు ♦ చావుఘటింపదె వేగ? దుర్విధీ!

కటకటా! ఎంతమందమతినైతిని?

సీ. మతిమాలి కడునజా ♦ గ్రతనూని నడిచేయి
      దారి మూయకనున్న ♦ దాన నేను!
   కుటిలాత్ముఁ డస్మాను ♦ కోటఁ జేరంగ న
      ద్దమచేయి గనకున్న ♦ దాన నేను!

తిరిగిపోయెదు జగ ♦ త్సింహుఁబోనీక పా
ర్థనజేసి రమ్మన్న ♦ దాన నేను!
గతిలేక నిర్బంధ ♦ గతికోడియుఁ గవాట
తాళంబు నిచ్చిన ♦ దాన నేను!

గీ. చకితనై విభు శతుగ్రీవ ♦ శమ్ముజేసి,
తనయు నల్లు నొసగనున్న ♦ దాన నేను!
రాజ్యవిధ్వంసమునకుఁ గా ♦ రణము నేను!
పాతకిని నాకుఁ బ్రాణముల్ ♦ బాయు వేల?

(అసివిచారించుచుండును.)

జగ—(తిలోత్తమతో) ప్రియసీ! ఏమిట్టులాలోచించుచున్నావు? నాప్రశ్నకు సమాధానమీయవా?

తిలో— అన్నిటికిని మావిమల దేభారము!

విమ—(తనలో) అన్ని శుభాశుభంబులకును నేనే భారమునువహించుచున్నాను! ఆహా! వీరిప్రణయసంభాషణముల నేనెట్టులాపగలను? హా! హతవిధీ! ఈసరికాదుర్మార్గులు నాదుర్గేశునిబంధించి యిచ్చటికి వచ్చుచుందురు. ఇఁక జాలము సేయరాదు!

జగ—(ఆలోచనతో) ప్రియసీ! నీకావిమల యేమగును?

తిలో—నాథా! నేడుమీరిట్టిప్రశ్నము వేయుచుంటిరేమి? ఆమె నా ప్రాణసఖి కాదా!—

జగ—(తనలో) ఈరహస్యము—విమలనాకెరింగించిన రహస్యము—గంభీరతరముగా నున్నది. కానిమ్ము! ఈరహస్యమును సవిస్తరంబుగా విమలమూలముగానే తెలిసికొందునుగాక!

విమ—(తనలో) ఇఁక చేయునది లేదు! అదిగో! దుర్మార్గుల కోలాహలము వినవచ్చుచున్నది.

లోపల 'దీన్ దీన్' అనుకోలాహలము.

జగ—(ఉలికిపడి యాలకించును.)

విమ—(ఏడ్చుచు జగత్సింహుని యెదుటకేగి) జగత్సింహా! సర్వనాశన మగుచున్నది! పఠానులు లోనఁబ్రవేశించి దుర్గేశునిబంధించి యిప్పుడిటకు వచ్చుచున్నారు! మీరిరువురు నావెంటరండు! మిమ్ములఁ దప్పించెదను. తడవుపలదు!—

తిలో—(భయము) హా! తండ్రీ! (మూర్ఛపోవును.)

జగ—(చకితుండై తనలో) ఛీ! ఛీ! ఎట్టిగతిసంభవించినది. వీరుఁడనయ్యు తుదకుచేతగానివానివలె నబలల మధ్య శత్రులఁజిక్కవలయుఁగా? (ధైర్యముతో నవుడు గరచి ప్రకాశము) విమలా! నీవామె నెత్తికొనిరమ్ము! మనకు భయమేమి? ప్రత్యక్షముగా మార్గము జేసికొని పోయెదముగాక! నా మేనబ్రాణములున్నంతవరకు మిమ్ముల నాతిశ్రేతుఁడైనను దేరిచూడలేఁడు! (ఖడ్గము బెరకి) నేను ముందునడచెదను. (వెడలనుండును.)

ప్రవేశము: పఠానుసైనికులు, 'దీన్ దీన్' అని కేకలు వేయుచు జగత్సింహు నరికట్టుదురు.

జగ—విమలా! మీరించుక వెనుకకుఁ దొలఁగుడు. మున్ముందిచ్చటనే మార్గము జేసెద. (పఠానులడీకొనును.)

భయంకరయుద్ధము: పఠానుసైనికులు చాల మంది మడియుదురు: క్రొత్తసైనికులు దండోపతండములుగాఁ బ్రవేశింతురు: జగత్సింహుఁడు నిర్వికృమపరాక్రమముతోఁ బోరఁ నాతనిశరీరమున గాయములుతగిలి రక్తస్రావముచే బలముక్షీణింపభూమిపైఁగత్తినానుకొని పడిపోవును.

ప్రవేశము : రహిమాన్.

రహి—(విమలనుజూచికోపము) సైతాన్! నన్నూ మోహంచేసి మెల్లీపోయావ్! ఇప్పుడెక్కడిక్కపోతావ్! సైతాన్ (విమలనుబట్టుకొన బోవును.)

విమ—హా! పరమేశ్వరా! నన్నుద్ధరించు వారెవ్వరు?

జగ—(ఈలోన తన్నుసమీపించినవారిని నరకుచు విమలయార్తారవమువిని లేనిబలమును దెచ్చికొని రహిమాన్ ఖాన్ తలఁజెండువలెనెగురగొట్టును.)

రహి—హాల్లా! హాల్లా! (మరణించును.)

జగ—(ఆయాసముతో మూర్ఛపోవును.)

సైని—(జగత్సింహునిజుట్టుముట్టి వానిశిరో వేష్టమునన్న రవ్వలతురాయిని దొంగిలింపఁ బ్రయత్నింతురు.)

ప్రవేశము : ఆయేషా

ఆయే—(గర్జించుచుఁ గోపముతో) ఈరాజపుత్రసింహము నెవ్వరునంటవలదు! మీరావలకుఁబొండు.

సైని—(భయముతో వెడలిపోవుదురు.)

ఆయే—(జగత్సింహునిశిరస్సును దొడపయినిడుకొని శిరముపయినున్న గాయములకుఁగట్టులఁ గట్టుచు విమలను జూచును.)

విమ—(తిలోత్తమకు సేదఁదీర్చుచు ఆయేషానుజూచి తెల్లబోవును.)

ఆయే—(విమల తెల్లబోవుటగ్రహించి) ఏమియు భయమునొందవలదమ్మా! మీకందరకు సౌఖ్యములిప్పించెద! బాధితులరక్షింప నావిధియైయున్నందున నీసుకుమారునకుఁ బరిచర్యఁ జేయుచున్నాను.

ప్రవేశము : ఆస్మన్ ఖాన్

ఆస్మ—(ఆయేషానుజూచి తెల్లబోయి) ఆయేషాసర్కార్! ఇది యేమి?—

ఆయే—నీవుదలఁచినమార్గమును విశుద్ధము జేయుచున్నాను.

ఆస్మ—నేనేమిదలచినాను?

ఆయే—ఈవీరునిజంపకూడదని నాతోఁజెప్పితివి కాదా! ఈవీరుని జంపనప్పుడతనిపూర్ణముగానేలఁగూలఁబడకూడదనియిట్లుఁజేయుచుంటిని!

ఆస్మ—సేవకులు లేరా!

ఆయే—సేవకులకీ విషయములు దెలియవని నానమ్మిక! (అని కట్లుఁగట్టిలేచినిలిచి) దుర్గేశుఁడేడి?

ఆస్మ—వానిని మనభటులచే మనపురికిఁబంపినాను. వీరలను గూడఁగొనిపోవలయును.

ఆయే—ముందుగా నీవనితల నవలకుఁగొనిపోయి సేవకులను గొనితెమ్ము! అంతవరకు నేనీతనిఁజూచుచుండెద!—

విమ—(తిలోత్తమకు సేదదీర్చును : తిలోత్తమ లేచును.)

ఆస్మ—(విమలాతిలోత్తమలతో) మీరు నావెంట రావలయును.

తిలో—(విమలతో) నాప్రాణవిభుఁడో!—

ఆస్మ—ఆతఁడుగూడవచ్చును. మీరురండు (విమల, తిలోత్తమ, ఆస్మన్, నిష్క్రమణ)

ఆయే—(జగత్సింహునిపాదములకడగూర్చుని చేతులుజోడించి లోనప్రార్థించుచుండును.)

తృతీయాంకము.





శ్రీరామచంద్ర

# ఆయేషా

## చతుర్థాంకము.

రంగము : దర్బారు.

సుల్తాన్ ఖతల్‌ఖాన్ : ఆస్మన్‌ఖాన్ : మంత్రులు

మొదలయినవారలు.

ఖత—ఆస్మన్! సేవకు లింకనుపీకేంద్రసింహు నిందుఁబ్రవేశ పెట్టలేదేమి?

ఆస్మ—(లేచి) సర్కార్! ఈసరికి మనభటులు వానిని దెచ్చుచుందురు.

ఖత—ఆస్మన్! నీవు చాలమంచిపనిని జేసినావు. ఏమియుఁగష్టము లేకుండ నిద్దరుశత్రువీరుల నొక్కసారిగాఁ బట్టితెచ్చినాఁడవు. నిన్ను దగినటుల బహూకరించెద లెమ్ము? బహూకరించెదను! సంతోషపెట్టెదను లే—

ఆస్మ—సుల్తానువారిదయచే నింతవరకు నాకేమియు లోపములు లేవు. కాని—(సాభిప్రాయముగ ఖతల్‌ఖానుని జూచును)

ఖుత—(చిఱునగవు) అస్మన్! నీమనమున నేదియో యాలోచించుచున్నావు? సందేహము వలదు. చెప్పుము—

అస్మ—(పార్శ్వములఁ జూచి సందేహించును)

ఖుత—అస్మన్! సందేహ మేల? చెప్పుము. ఏదయినను సరియే! చెప్పుము.

అస్మ—సర్కారువారికి నాపయిగోపము వచ్చునేమో?—(సందేహము)

ఖుత—అస్మన్! నేఁడిట్టుల మాటలాడుచున్నావేమి? భయము వలదు. నాయొద్ద నీకింత సందేహ మెందులకు? చెప్పుము.

అస్మ—(విధేయత) సర్కారువారిదయవలన నాకు సర్వసైన్యాధిపత్యము లభించినది. ఇంక నాకొక్క కోరిక మాత్రము గలదు. అది నెరవేఱునేని నాకింకేమియు నగత్యము లేదు.

ఖుత—అది యేది?

అస్మ—సుల్తాన్ సర్కార్! (ఇటునటుఁ జూచి) తమకుమార్తె యగుఆమేషా వివాహమునుగూర్చి—

ఖుత—(చిఱునగవు) ఆమెను నీకిచ్చి వివాహము సేయుమందువు. అస్మన్! ఇదియేనా నీకోరిక? ఇందులకు నాయాటంక ముండునని తలంచితివా? ఈవిషయమై నేనును యోజించుచునే యున్నాను. కాని నాకొక సందేహము కలదు. ఆమెవివాహవిషయమున నేనేమియు స్వాతంత్ర్యింపఁదలచుకొనలేదు. నీకామెతోఁ బరిచయము మెండుకదా! నీవామె నే గనుగొనుము.

అస్మ—తమయిష్టానుసారము మే మొనరించెదను. (కూరుచుండును)

ప్రవేశము : భటులు వీరేంద్రసింహునిబంధముల
తోఁ గొనివచ్చి యొకప్రక్కగా నిలుచుండఁ
జేయుదురు

అస్మ—(లేచి) సర్కార్! గరమందిరదుర్గాధిపతియగువీరేంద్ర సింహుఁడీతఁడే!

ఖత—అటులనా! (వీరేంద్రసింహునితో) వీరేంద్రసింహా! నీవేనా గరమండిరదుర్గాధిపతివి?

వీరే—(ధీరత)ఔను. గరమందిరదుర్గమునకు నేనేప్రభుఁడను—

ఖత—నీవుమాయొరిస్సాదేశవాసివే కదా!

వీరే—(కోపముతో) దుర్మార్గులు—తుచ్ఛులునగు మీపారుగుననే యున్నవాఁడ! ఒరిస్సాదేశవాసినే—

ఖత—(కోపముతో) ఏమి! మేముదుర్మార్గులమా? తుచ్ఛులమా? నీకుబుద్ధిలేదు. శిక్షతప్పదు.

అస్మ—వీరేంద్రసింహా! సుక్షత్రియుఁడవు! మర్యాదవదలి మాటలాడకుము. సుల్తానువారికి కోపమువచ్చుచున్నది.

వీరే—(ధైర్యముతో) అస్మన్‌ఖాన్! ఈఖతల్‌ఖానుని సూల్తాన్‌అని బిలుచుటకూడ నాయాత్మగౌరవమునకులోపమే! ఈతఁడు నన్ను శిక్షించుననెడిభీతి నాకిసుమంతయు లేదు! అట్టిభీతి రాజపుత్రులక్షణము గాదు! ఒక్కరాజపుత్రులకేకాదు. ఎవఁడు స్వధర్మమును స్వదేశాభిమానము, స్వరాజ్యసంరక్షణయుఁ దనజీవితాశయములుగ నెంచునో— ఎవఁడుధర్మస్థాపనకై పాటుపడునో— ఎవఁడునిష్కల్మషహృదయుఁడై స్వార్థమునెంచక దేశక్షేమమునకుఁ బాటుపడునో—అట్టివాఁడీతుచ్ఛములగు ప్రాణముల కాశించునే? అస్మన్! నీవేదియోమర్యాదయంటివే? బందిపోటుదొంగలతోఁ దుల్యులగు మీకు మర్యాద యెక్కడిది?

ఖత—(ఆవేశముతో) బద్మాష్! తిన్నగా మాటలాడుము—

వీరే—(రోషము) ఆ—ఆ—నీగతి యిప్పుడేమి కానున్నదో చూచుకొనుము. (బంధములను ద్రెంచి సుల్తానుపైఁబడబోవును.)

ఖత—(భయము)

ఆస్మన్, భటులు, వీరేంద్రుని బలవంతము
గాఁ బట్టుకొని మరలఁ బంధింతురు.

వీరే. (రోషముతో) తుచ్ఛుఁడా!

ఖత—(కోపముతో) ఆస్మన్! వీఁడు కారులరచుచున్నవాఁడు వీనిని తక్షణము తీసికొనిపోయి శిరచ్ఛేదనము గావింపుము. ఇట్టి రాజ ద్రోహిని ఇఁక నుపేక్షింపరాదు. ఇట్టివారల విడచిపుచ్చిన మిగిలినవార లుకూడ ఈతనిదురోచ్ఛధనలఁజిక్కుట కవకాశము కలుచుండును. ఆలసిం పకుము—

ఆస్మ— సర్కార్! మీరానుపచించినది నిజము. కాని ఈ నేరస్థు నిసంపూర్ణముగ విచారణచేసి, ఈతఁడు చెప్పిడిదంతయు వినినపిదప తీర్పునుజెప్పుట రాజధర్మము! సర్కార్! ఈ నేరస్థుని సంపూర్ణముగబ్రశ్నించి నేరారోపణము స్థిరపరచెదను. ప్రాణముపీడనుండెడు ప్రతిప్రాణియు నిట్లువదరుట లోకసామాన్యమైన విషయము. మీరించుక నూరకుండుఁడు. నేనీతనిఁబ్రశ్నించెదను.

వీరే—(ఆస్మన్‌తో) ఏమి? ప్రాణభీతిచే వదరుచుంటినా? తుచ్ఛులకు—హంతకులకు—పాపులకింతకంటె యోజన దోచునా? నేను చచ్చిపోవుదునని యిట్లువదరుటలేదు. ఏస్థితిలో మిమ్ముజూచినను ఇంతకంటె వేయిరెట్లధికముగ మిమ్ములదూరియుందును. గౌరవనిహీనులగు మిమ్ముల నిట్లగౌరవించియుందును.

ఆస్మ—దుర్గాధిపా! మీరెన్నివిధముల నేమిబలికినను న్యాయముమనుయోజింప మాపిధియైయున్నది.! మీరు మమ్మెట్టివిధమున యో

ఱించుచున్నను, మాకుకూడ న్యాయాన్యాయము లున్నవి. కాన నేనే యుపప్రశ్నలకు మాత్రము సదుత్తరములనీయ మిమ్ములఁ బ్రార్థించు చున్నాను.

వీరే—అస్మత్ ఖాన్ ! నేనెప్పుడు నసత్యమాడువాఁడనుగాను. నిజమునే బల్కుచుందును. నిజమాడిన నీఖుతల్ ఖానునకుఁ గష్టముగా నున్నది.

అస్మ—మహాశయా ! అక్బరుపక్షమునఁబోరుచున్న జగత్సింహుని పైఁదాడివెడల మీ సేనలతో మాకు బాసటగారమ్మని మాసర్కారు మీకు హుకుమునుబంపినపుడు మీ రేలతిరస్కరించినారు?

వీరే—హుకుమునుబంపుట కీతనికధికారమెక్కడిదో మొదటఁ జెప్పుము?

అస్మ— మేమీయొరిస్సాదేశమునకుఁ బాలకులము కామా?

వీరే—ఒరిస్సాదేశమంతయు మీదెట్లగును? మొగలుచక్రవర్తి దయగు అక్బరుసార్వభౌమునిది కాదా!

అస్మ—పూర్వము మొగలుచక్రవర్తిదయయినను ఇప్పుడు మాస్వాధీనమయినదిగాదా?

వీరే—మీస్వాధీనమయినను, హుకుమునుజారీచేయుటకు నేను మీకు సామంతుఁడనా? సర్వస్వతంత్రుఁడనగు నాకు మీరు ప్రార్థన పూర్వకముగ సహాయపత్రమును వ్రాయుటమాని హుకుమును జారీ చేయుటలో మీయవినీతి తెల్లమగుటలేదా?

అస్మ—పోనిండు! మీరును మేమును ఒకదేశవాసులమేకదా! ఒకదేశమున నొకరికొకరు సహాయముచేసికొనుట రాజ్యక్షేమకరమగు కార్యమే!—మీరేల మాకు మాపొరుగుననుండియు సహాయముఁజేయఁ దోడుపడలేదు?

వీరే—అస్మన్!—సహాయము చేయవలయునా? కలుషరహి

తులగు భారతీయులు మీరాజ్యనిర్మాణతంత్రాభిలాషను గమనింపలేక, మిమ్ములనమ్మి మీకుసహాయము జేసినందులకే ఇట్టిచట్టలు బుట్టుచున్న వి. మీస్వార్థపరాయణతను దెలిసికొనఁజాలిన ఏభారతసోదరుఁడయి నను మీయభిప్రాయములకు—మీదుశ్చర్యలకుఁ దోడ్పడునా?

ఆస్మ—మహాశయా! మీరుఁజెప్పినది యదార్థమేకాని, స్వశక్తి నెఱుఁగక పరిపాలనాసమర్థతలేక, తమతమరాజ్యములను నిలుపుకొనఁ జాలని భారతరాజులకు రాజ్యమెందులకు? పరిపాలనాసమర్థతగలిగిన వారెవరయినను గన్పడునపుడు దేశక్షేమముకొరకు, సంఘీభావముకొ రకు మీభారతీయులట్టివారిని సేవింపవలదా?

ప్రీరే—ఏమి? సంఘీభావముకొరకును, దేశక్షేమమునకును బరు లను సేవింపవలయునా? ఆస్మర్! ఎంతయాలోచనాపరుఁడవు! సంఘీభా వమును దేశమున నెలకొల్ప నసమానరాజ్యపరిపాలనాదురంధరులగు మాభారతీయులు లేరా? ఎన్నికష్టములుబెట్టినను లెక్కసేయక దేశర క్షణయే జీవనోపాధిగనెంచి తినఁగూడును, కట్టబట్టయులేక యరణ్య ముల రాజ్యనిర్మాణగిరాకాంక్షుఁడయిదిరుగాడు మారాణాప్రతాపుఁడు లేడా? అట్టిభారతపుత్రులు మరినలువురుగలిగిన మాదేశమున మీరు కాలిడఁగలిగియుందురా? కాలిడినను రాజ్యము నిర్మింపఁ గలిగియుం దురా?

ఆస్మ—దుర్గేశా! ఒక్కరాణాప్రతాపునుబోలిన మరిపదిమంది యున్నను లాభమేమి? దేశమంతయు సాంఘికరజ్జువులచే నెప్పుడుపూర్ణ ముగ బంధింపఁబడియుండునో అప్పుడు పరులకట్టిదేశమునఁ గాలిడ నవ కాశమొదవదు. సర్వసమత్వములేక, యుచ్చనీచ లనుమిట్టపల్లంబులఁ బడి పరువులెత్తు మీహిందూమతచక్రింబునకు స్వరక్షణోపాయము తట్టునే? ఎంతకాల మీభారతభూమియందు సాంఘికదౌర్జన్యములు విల సిల్లుచుండునో, ఎంతకాలము భారతపుత్రులు ఏకోదరభావమువహింపక

ఆచారములఁబద్ధులయి సర్వసమత్వము నరయఁజాలరో యంతకాలము వరకు సంఘీభావముకలుగుట దుస్తరము. సంఘీభావములేనిదే స్వదేశ రక్షణ కల్ల! స్వదేశరక్షణలేనిదే రాజ్యప్రాప్తి దుర్ఘటము! మహాశయా! ఈతత్వములన్నియు సంక్షేపముగ నాకును దెలియును. మీరునాకు వేరె జెప్పనగత్యములేదు. ఈలోటుపాటుల మీయందుండుటచేతనే మేము కాలిడఁగలిగితిమని నాకును దెలియును. ఈలోటుపాటులే మొగలా యీల నీదేశమందు స్థిరస్వరూపులుగఁ జేసినది. ఇప్పుడు మమ్ములను జేయనున్నదికూడ యీతత్వమే. ఇన్నివిషయములు మీయందు లోపించుటచేత నాలోపములను సవరింపఁగలిగిన మరియెవరయిననుమీద్వృక్ష్యమునకుఁ దోఁచినయెడల మీరుచెప్పెడి దేశక్షేమమునకే వారలను మీరు సేవింపవలసియుండును. ఈవిషయములనుబట్టి ప్రస్తుతము మీరు మాకు సహాయముఁ జేయవలసి యున్నది.

వీరే—మాయందు ఆచారవ్యవహారములవలన నైకమత్యము చెడుచున్నదని మీయభిప్రాయముకదా! కాలముమారినకొలఁది యాచారములుకూడ మారుచుండును. నొప్పికలిగినకాని యుపాయము తోఁచకపోవుట మానవతత్వము. మీరుచేయు విభజనాపద్ధతుల ననుసరించినపాలనవలన మేముపొందెడి కష్టములే మీనాశనసాధనమునకు సోపానములుగనమరి మా సాంఘికసమత్వమునకు హేతుభూతములై మీకుసహాయము చేయవలదని నన్ను ప్రోత్సహించినవి—

ఖత—ఆస్మర్! వీనితో నూరకగాలయాపన మేలఁజేసెదవు? ఈతఁడు తనయిచ్చవచ్చినరీతిని ప్రేలుచున్నాఁడు! ఇఁక సైరించుట దుస్తరము. వీనికి శిరచ్ఛేదనమున దత్తర్యులనొసంగుచున్నాఁడను. తెచ్చి ణము గొనిపొమ్ము.

వీరే. —(చిరునవ్వు) సుక్షత్రియునకెన్నఁడును మరణమన్న భీతి

కలుగదు! మారసపుత్రుల ధైర్యసాహసములింకను మీకుఁ దెలియునట్లులున్నది.

ఉ. ఆజిన రాతిసంసదభ ♦ యంకరులై, విలయాగ్నికీలవి
భ్రాజితశౌర్యవీక్షణభ ♦ వద్గతశత్రుపరాక్రమక్రమో
త్తేజకులౌ మఁ జావవెఱ ♦ దీయనిశూరులు రాజపుత్రు లే
రాజులనెట్లు నెంచితివి ♦ రా? మదిలోన దురాత్మ! దుర్మతీ!

ఖిల—(చిందులుత్రొక్కుచు) బద్మాష్! (అస్మన్‌తో) ఆస్మన్! పీనిని నా యెదుట నుండనీయకుము! తొలఁగించుము.

ఆస్మ—మహాశయా! మాసుల్తాన్ సర్కారు తనతీర్పునందలి కడపటిభయంకరవాక్యము నుచ్చరించినారు! ఇంకమిమ్ముల నొక్కటి—

వీరే— (అగ్నోక్తియుం దేరోషముతో) అస్మన్! మరణశిక్షయని నన్ను బెదరింపఁ దలంచితివా? మరణమన్న నాకుభయమని యెంచితివా?— అది నాకేకాదు, మావంశములో నెవ్వరికినిగూడ భయాస్పదముకాదు.

సీ. లలితమహామాధవీ ♦ లత రసాలముఁ జేరి
చనవుగాఁ బెనవేసి ♦ కౌఁగిలించు రీతి;
కుసుమసుమసుగం ♦ ధము సమీరునిఁ గోరి
హాయిగా మిళితమై ♦ యలరురీతి;
లేతమహా యేటివిమ ♦ ల్లియు రాజవనిఁ జేరి
వేగఁ దానేపుగాఁ ♦ బెరుగురీతి;
దినములో వృద్ధులప ♦ ల్లవము బుఱ్ఱులమీఱి
బాగుగా నెండఁగా ♦ పాడురీతి;
గీ. భార్యవోలెను; మిత్రుని ♦ భంగి; తనయు
రీతి; సేవకుసరణి; నీ ♦ వృత్త్యుకాంత

జేరు మమ్ముల! నొకవేళఁ • జేర వెరచు!
భయమునాకేల దాని వెం • బడి నరుంగ?—

నేను సంసిద్ధుడనై యున్నాను. తత్క్షణము మీకార్యమును నిర్వహించుకొనవచ్చును—

అస్మ—మీకు భయము లేదని నాకుఁ దెలియును. మిమ్ముల విడచుట కల్లయనియును నాకు దెలియును. కాని మేమెంత క్రూరులమని మీరు తలచుచున్నను, మాకును ధర్మములున్నవి.

వీరే—(ధీరత) మీధర్మములతో నాకుఁ బని లేదు. నన్ను మీరు వెంటనే అంతమొందింపుఁడు. నా జీవితచారిత్రమే నా భారతసోదరుల కాదర్శప్రాయమై వెలయుచుండును—

అస్మ—మాధర్మములతో మీకు నిమిత్తము లేకపోయినను, మరణసమయమున మీకడసారి కోరికను మన్నింప మావిధియైయున్నది.

వీరే—నాకే కోరికయును లేదు—

అస్మ—మీతనయను చూడగోరరా?

వీరే—(ధీరత) మరణసమయమున మనోవికారమునకు తావొసంగు నాతనయ తిలోత్తమను నా కన్నులఁబడనీయకుండుటయే నా యభిమతము! నా కోరికను చెల్లింపఁదలచితివేని, నాయవసానసమయమున నా మెను మాత్రము నాదగ్గరకు రానీయవలదు—

అస్మ—(సేవకుల కాజ్ఞాపించును)

భటులు వీరేంద్రుని గొంపోవుదురు.

ద్వితీయరంగము : శయ్యాగారము.

ప్రవేశము : ఆయేషా.

ఆయేషా—(దీర్ఘనిశ్వాసము) ఏమిచేయుదును?—నేఁదలంచినరీతి నన్నియు ననుకూలముగానే జరిగినవి—నగరమందిరము స్వాధీనమయి నది—హృదయేశ్వరుఁడు బట్టువడి నాసౌధమందొకభాగమున గాయముల బాధనుండి విముక్తుఁడయి సుఖుఁడయి యున్నవాఁడు—చేయించదగిన కార్యములను సేవకులచేఁ జేయించుచున్నాను. ఇంక దుర్భరతరమయిన—నేఁజేయుకార్యము మిగిలియున్నది—(ఆలోచన) ఆజగత్సింహు నేవిధముగ ప్రార్థింపగలను? ఆవీరపురుషునకు నాప్రేమ నెట్టుల నెరింగింపగలను? (ఆలోచన) ఏమిది? నాహృదయ మింతదుర్బలతను వహింపుచున్నది! నేను వీర.........ఇంత సందేహ మేల? నేఁడే యాధీరచిత్తుని యెదుటఁబడి వానికి నాప్రేమ నెరింగించెదనుగాక! ఈనాఁడే జగత్సింహునకు నానిశ్చితాభిప్రాయమును తెలియఁజేసెదను!......

(దీర్ఘాలోచన : పరధ్యానము.)

ప్రవేశము : ఆస్మాన్.

ఆస్మా—అయేషాసర్కార్!—

ఆయేషా—(అస్మాన్ఖానునిజూచి) ఆస్మాన్! ఇచ్చటకూడ మన్ననయేనా? నేఁడేదియో క్రొత్తవానివలె నిలచియుంటివి! రమ్ము. ఆశీనుఁడవు కమ్ము.

ఆస్మా— (ఆసీనుఁడగుచు) క్రొత్త యేమియును లేదు. కాని మిమ్మొకటి ప్రశ్నింపవలయునని వచ్చితిని.

ఆయేషా—(చిరునగవు) ఆస్మాన్! మరల 'మీర'ని మన్నించుచున్నావు. ఇది మన్ననలకుఁ దావు కాదు. మనమందర మేకకుటుంబములోనివారముగా భావించి చనవుగా మాటలాడవచ్చును.

ఆస్మ—(దరహాసము) ఆయేషా! జగత్సింహుఁడు సంపూర్ణారో గ్యము నొందియున్నాఁడు! ఇఁక వానితో మనకును, మొగలాయీ చక్రవర్తియగు అక్బర్‌పాదుషాకును సంధియేర్పాటుల విషయమయి మాటలాడవలయును.

ఆయే—అందులకు నేనాటంకము జేయుదునని యెంచితివా!

ఆస్మ—లేదు. లేదు. ఆతఁడెప్పుడును నీసాధమందుండుటచే రాచకార్యములు చెడుచున్నవి. వానినింక బయిటకుఁ గొంపోవల యును.

ఆయే—అస్మా! వింతగా మాట్లాడుచున్నావు? జగత్సింహుఁ డిచ్చటనుండుటచేత రాచకార్యములు చెడుచున్నవా? ఇచ్చటమాత్ర ము రాచకార్యములు ముచ్చటించుకొనరాదా? అందులకు నేనభ్యంత రము జేయుదునని యెంచితివా? జగత్సింహుఁడు వినడనుకొంటివా?

ఆస్మ—జగత్సింహుని క్షేమమువిషయమున నీవెల్లపుడును క డు శ్రద్ధాభక్తులతోనుండుటచే నాటికి భంగముకలుగచేయరాదని నాతలంపు—

ఆయే—ఏమిది? అస్మన్!—మనమునందేదియో బెట్టుకొనిమా ట్లాడుచున్నట్లగపడుచున్నావు? ఎల్లప్పుడును జగత్సింహుని నేనుకనిపెట్టు కొనియుందునని నీవెంచితివా?

ఆస్మ— ఆయేషా! ఇన్నియెందులకు! నిన్నొకటిప్రశ్నింపఁదలచి వచ్చితిని! అది జగత్సింహుఁడువినరానిది. ఇతరులకుఁ దెలియరానిది—

ఆయే—(ఆలోచన : చిరునగవు) అట్లయిన నీరాచకార్య మబద్ధమా?

ఆస్మ—అబద్ధమేల? నిజమే! ముందీవిషయమైనవెనుక జగత్సిం హునితో మాటలాడెదను!

ఆస్మ—(సంకోచము : ఆలోచన)

ఆయే—(స్వగతము) ఇదియేమి ? ఈతఁడిట్టుల సంకోచించు చున్నాఁడు? ఈతనియాలోచనలు ప్రణయసంబంధములు కావుకదా? (ప్రకాశము) అస్మర్! ఏమాలోచించుచున్నావు?

అస్మ—(నిశ్చలత) ఆయేషా! సుల్తాన్ సర్కార్ వారి దయవల్ల నాకీపఠాన్ రాజ్యమున మహోన్నతపదవి లభించినది. సర్వవిధసౌఖ్యములును లభించినవి. ఆయేషా! జాగ్రత్తగా వినుము. ఇప్పుడు నేను బ్రశ్నింపబోయెడిది నీపెండిలి విషయమైనది సుమీ!

ఆయే—(నిర్మలభావము) అస్మర్! నీహృదయము నాకుబోధపడినది. నీవు నన్ను ప్రేమించుచున్నావనియు నాకుదెలియును. కాని యీ విషయమున నాకేమాత్రమును స్వతంత్రములేదు. మాతల్లిదండ్రులయిష్టప్రకారమే జరుగవలయు నని నాయభిమతము.

అస్మ—నేను మీజననీజనకుల నీవిషయమయి బ్రశ్నించితిని.

ఆయే—వారేమనిరి ?

అస్మ—నీవివాహమువిషయమున వారు స్వతంత్రించమనియు, నీయిష్టముప్రకారమే జరుగఁగలదనియు, నిన్నే యడుగుమనియుఁ జెప్పిరి.

ఆయే—(గాఢముగా నాలోచించి) అయిననిప్పుడేమందువు ?

అస్మ—ఆయేషా ! ఏమందువని నన్నుబ్రశ్నింపనేల ? నేను నిన్నే మి బ్రశ్నింతుననుకొనుచున్నావు. ఆయేషా ! నేను నిన్ను బ్రేమించు చున్నాను. ఇంక నీహృదయమును నాకెరిగింపవేడెను.

ఆయే—అస్మర్ ! నాహృదయమును నీకెరింగింపవలయునా ?

అస్మ—అవును!—

ఆయే—ఇప్పుడేనా?—మరియొకప్పు డెరింగింపకూడదా ? మరి యొకప్పుడైనయెడల నాహృదయము నేనుచెప్పనిదే నీకు బోధపడునే !

అస్మ—ఆయేషా! అంతవరకు వేచియుండుటకు నాహృదయము

జగ—(దిగ్గునలేచి కనులుమూసికొని రెండడుగులువైచి) తిలోత్తమా!— తిలోత్తమా! — ఏమైపోయినావు?—(అని కన్నులవిప్పి ఆయేషానుజూచి దిగ్భ్రమజెంది, తనలో) ఈమె నాతిలోత్తమకాదు— నాతిలోత్తమ కాదు-—ఈమె యెవ్వరో—(బాగుగాపరిశీలించి మేలిముసుగులోనున్న ముఖమును గుఱుతింపలేకపోవును.)

ఆయే—(విభ్రాంతిజెంది మేలిముసుగును సవరించుకొని యొకమూల నొదిగియుండును.)

జగ—ఈమె నాతిలోత్తమ కాదు!—కాదు!—ఎవ్వరో?—నాశయ్యాగారమున - నర్థరాత్రమున - నొంటరిగా - ఈమె యెందులకువచ్చియుండును? - (ప్రకాశముగా) నీవెవ్వతెవు? అర్థరాత్రమున నాశయ్యాగారమున నొంటరిగా నెందులకుఁ బ్రవేశించినావు?

ఆయే—(తనలో) సంభాషణకెట్లుగడంగుదును?

(ఆలోచించుచుండును)

జగ—ఓయువతీ! సమాధానము చెప్పవేమి?

ఆయే—రాజపుత్రా! నేనెట్టిదుర్మార్గమును దలపెట్టి యిటు రాలేదు. దాచియుంచుకొనిన యొకరహస్యవస్తువును మరల దెచ్చికొనుటకై యిలువెడలి మార్గవశమున నిందుఁ బ్రవేశించినాను.

జగ—నీవస్తువు భద్రముగా దాచియుంచుకొనినయెడల పగలే లదానిని కరగతముజేసి కొనలేదు?

ఆయే—అది కడురహస్యమైన దగుటచే—

జగ—అయిన నాశయ్యాగారమును బ్రవేశింపనేల?

ఆయే—రాజపుత్రా! నాహృదయమును హరించిన యావస్తువు—నామనోహరమగు నావస్తు విందుండుటచే—ఇచ్చటికి రావలసివచ్చినది.

జగ—ఇందునగా నీసౌధమందా?

ఆయే—ఈసౌధమందే! ఇందే!

జగ—ఓయువతీ! నీమాటలు నాకర్థముగుటలేదు! నీస్వభావము మంచిదిగాఁ గాన్పించుటలేదు. ఈసౌధము సుల్తాన్‌తనయయగు నాయేషాదని సేవించును. నీవేదియో దుర్మార్గమునుతలపెట్టి యీసౌధమున నామెకుగూడ దెలియకుండ సంచరించుచున్నదానవని నావిశ్వాసము. ఈసమయంబున సపరిస్తుతప్రవేశమొనరించిన నీవు బురుషుఁడవేయైనచో నిన్నీక్షణమందేబంధించి, ఉదయమున నామెకడ కనిపియుందును. కాని నీవట్లుగాక యొకస్త్రీవగుట నింతతడయచలసివచ్చినది. ఇంక నా ప్రశ్నములకు సరియైనయుత్తర్వుల నీయవలెను.

ఆయే—రాజపుత్రులు స్త్రీలనునిర్బంధింతురని నాకీసుమంతయును భయములేకపోవుటచేనేనిందుబ్రవేశించితిని. ఒకవేళ నీవు నన్ను బంధింపదలచినయెడల బంధింపుము అందులకు నాకంగీకారమే? ఈ పఠానుకాంత యింతమాత్రమునకు వెనుదీయునా?

జగ—రాజపుత్రుఁ డొక్కఁడిందుండెనని తెలిసియే వచ్చితివా?

ఆయే—ఒక్కరాజపుత్రుఁడనియేకాదు? ఆవీరుఁడు జగత్సింహుడనిగూడ నేనెరుంగుదును.

జగ—ఓతరుణీ! నీచర్యవింతగానున్నది. నీవు స్త్రీవగుటచే బ్రతికిపోతివని యిదివరకేచెప్పితిని. నీవెవ్వతెవు! నీపేరేమి? వెంటనేచెప్పి నీ వస్తువును వెదకికొని తక్షణమవెడలిపొమ్ము! జాగుచేసితివేని సేవకులను బిలచెదను.

ఆయే—జగత్సింహా! నేనుపఠానుకాంతనని నాయుడుపులే దెలియఁజేయుచున్నవి. (మేలిముసుగును తొలగించి) నాపేరాయేషా!

జగ—(విస్మయముతో వెనుకకుజరిగి తనలో) ఎంతప్రమాదము! ఇట్టిసమయమున నీమెయిచ్చటికేలవచ్చినది? నాకేమియుదోచదే! (ప్రకాశముగా) ఆయేషా! ఎరుగకనిమ్ములఁదూలనాడియుందును.

ఆయే—(చిరునగవుతో) జగత్సింహా! నన్ను తూలనాడ లేదే!

జగ — ఆయేషా! మీరిట్టి సమయమున నొంటరిగాఁ బరులశయ్యాగారమునఁ బ్రవేశింపనగునా?

ఆయే— ఈమందిరములోఁ బ్రస్తుతము నీవున్నను, ఈ సౌధము నాయదియే!— నా సౌధములో నేను సంచరించిన తప్పేమి?

జగ— ఆయేషా! అంతఃపురాంగనలతో నొంటరిగా—అర్ధరాత్రమున- మాటలాడ రాదు!—ఆయేషా! జాగుసేయక మీ వస్తు వెచ్చటనున్నదియో చెప్పుఁడు. నేనైన వెదకి యిచ్చెదను. మీరు త్వరలో వెడలిపోవచ్చును.

ఆయే— నామనోహరమగు వస్తువిచ్చటనేయున్నది.

జగ—(గది వెదకుచు) ఇం దేదియు నూతనమగు వస్తువుగానరాదే!

ఆయే—(దరహాసము) ఎల్లప్పుడు నిందుండు మీకు నూతనమట్లగును! అది నాకన్నులకుఁ గట్టినట్లగపడుచున్నది.

జగ—అట్లయిన నాయేషా! దాని పేరేదియో నాకెరింగించుఁడు. తెచ్చి యిచ్చెదను. మీరు త్వరలో వెడలిపోవచ్చును.

ఆయే — వీరుఁడా! నావస్తువును నేను దెచ్చుకొనలేనా?

జగ —మీకు శ్రమకలుగు ననియట్లంటి—

ఆయే —నీవుకూడ సాయము చేయుదువా?

జగ —సాధ్యమయినంతవరకు—

ఆయే—జగత్సింహా! నాప్రియమైన వస్తువెద్దియో నీ వెరుగవా?

జగ —(స్వగతము) ఇది యేమి! మాటలచే నీమె కాలయాపన చేయుచున్నది. ఇచ్చటనేదియు నూతనమగు వస్తువుగానరాదు. (ప్రకాశము) ఆయేషా! మీ వస్తునామమేదియో చెప్పినచో వెదకి తెచ్చి యిచ్చెదను.

ఆమే. -(చిరునగవు) జగత్సింహా!

చ. సరసత నెల్లవేళలను ♦ సౌఖ్యమునిచ్చునదేది? - ఘోరదు
ర్భరపరితాపమందు మది ♦ రంజిలఁజేయునదేది? - కాననాం
తరమున నైన నెంచిన ము ♦ దంబునొసంగునదేది? - భావబం
ధురమగుతన్మయంబున వి♦ మోహము సెయ్యదిగూర్చు?-చెప్పుమా?

ఇప్పుడు చెప్పుము.

జగ—(స్వగతము) ఏమి ఈమె యీతీరున నసంబంధములగు మాటల నుడువుచున్నది. ఈమెయభిప్రాయ మేమైయుండును! నిండు జవ్వనియగునీమె భావములు...... వేరొక...తీరున...విస్తరించుటలేదు కదా? ఏమైన నీమెను వారించెద! (ప్రకాశము) నాబుద్ధికేమియు స్ఫురించుటలేదు. మీరే యావస్తువునుబరిగ్రహించి వెడలిపొండు!

ఆమే —జగత్సింహా! ఎన్నివిధముల నీకుఁదెలియఁజేయుదమన్నను, నీవు నాప్రియమైనవస్తువేదియో గ్రహింపఁజాలకున్నాఁడవు! ఇఁక నేనే తెలియఁజేసెదనాలకింపుము.

జగ—(నిశ్చలత) సావధానుఁడనై తిని—

ఆమే—ఏమనోహరమగువస్తువర్ణన మొదటినుండియు వినుచుంటినో, దేనినిస్వాధీనముచేసికొననెంచి వీరనారినై స్వయముగ నరణ్యములఁబ్రవేశించితినో, దేనికొరకు తీరనియిక్కట్టులనొంది విశాసమయమున, గరమందిరదుర్గమును జొచ్చితినో,ఏనామనోహరమైనవస్తువును నాసైనికులంతమొందింపఁబ్రయత్నించినపుడు గాపాడుకొని నాసౌధమునఁజేర్చి లాలించియుంటినో, యావస్తుస్వరూపము- - - - - - జగత్సింహా! (సిగ్గు) ఇ-ది- యే!---(చిఱునవ్వుతో జగత్సింహునిఁజూపును) సుందరుఁడా! ఆనామనోహరమగువస్తువును నాకుఁదెచ్చియిమ్ము.

జగ—(స్వగతము) చిక్కుగలిగినదే! తుదకీమెసమాచారము నేననుకొనినట్లే పరిణమించినది. (ప్రకాశముగా) ఆయేషా! మీరున్న

తవంశసంజాతలు! మీరుమిక్కిలి సుల్తానుగారాబుపుత్రికలు! సౌంద ర్యాతిశయముచేతను, విద్యాగంధమువల్లను, వీరకృత్యముల తోడను లోకమునఁబ్రసిద్ధికెక్కినవారలు! మీచరిత్రమందరికాదర్శప్రాయమై వెలయవలసియున్నది. అట్టిమీరు ఒకపరపురుషుని—అన్యమతస్థుని—ఆపైని ప్రబలశత్రువుని—ఈతీరునవభిలషించుట మీవంటివారలకు తగునే?

ఆయే—సుందరుఁడా! ఘోరారణ్యములనక శత్రుదుర్గముల నక—కష్టములకోర్చి— భావిసౌఖ్యమునుదలంచుచు నిన్నికృత్యముల జేయించినది నాహృదయము!— ప్రతిప్రాణికిని ముఖ్యమగునది మానసికప్రకృతి! దానిననుసరించియే ప్రతిప్రాణియు సంచరింపవలసియుండును. దానితత్వము దురూహ్యము - దురంతము - దుర్గమము. నేనును అట్టిప్రకృతి ప్రోత్సాహితనై యీకృత్యములఁ జేసితిని. ఆప్రకృతియే నిన్ను—అన్యమతస్థుని—పరపురుషుని —ప్రబలశత్రువుని—ప్రేమింపఁజేసినది. మనోహరా! ఇఁకసందేహమెందులకు? నేనునిన్ను ప్రేమించుచున్నాను. నాప్రేమనంగీకరించి నన్నుద్వాహమాడి నన్నుకృతార్థురాలనుగాఁ జేయుము.

జగ—ఆయేషా? మీనుడువులు సత్యములు. ప్రతిప్రాణియు దనమనోగతాభిప్రాయమునుబట్టిప్రవర్తించుట సహజము. కాని యట్టి మనోగతంబులకుఁగూడ యుక్తాయుక్తవిచక్షణ నిరూపింపఁబడియున్నది. ఆమనోగతములు, సన్మార్గములనియు, దుర్మార్గములనియు, రెండు విధములు. సదభిప్రాయముతోఁగూడినహృదయముగలవారలే సత్పురుషులు. దురభిప్రాయముతోఁగూడినవారు దుర్మార్గులు. మొదటి తరగతిలోనివారు తమహృదయమును ఇచ్చవచ్చినరీతిఁ బరుగిడనీయక సన్మార్గముననే నడుపుచుందురు. రెండవతరతిలోనివారు తమమనస్సునుస్వాధీనముచేసికొనలేక వాని యిచ్చవచ్చినరీతిని మెలంగుదురు. ఇప్పుడు

మీరు చెప్పినచొప్పులనుబట్టి మీరు మీహృదయమునకువశ్యులై మెలంగుచున్నందున మీహృదయము రెండవపక్షమునకే జెందును. కావున మీయీయభిప్రాయమునువిసర్జించి సజ్జనసరణిననుకరింపుఁడు. పరనారులను సోదరీమణులుగనెంచుట సజ్జనసాంప్రదాయము. సోదరీ! ఇంక మీయభిప్రాయమును ఉపసంహరించి వెడలిపొండు.

ఆయే—ఆహా! సాహసికుఁడా!—నీవీవిధముఁబలుకుదువని కలనైనఁదలంపనైతినికదా!—నీవీతెఱంగున నిరాకరింతువని యెన్నఁడు నెంచనుకదా!—నీహృదయమింతకఠినతరమని నేనెఱుంగనైతినికదా!—కోరిప్రార్థించుయువతిని నీవిట్లు నిరాకరింతువని యెంచనైతినికదా! వీరపురుషా! ఏనాఁడు నీపరాక్రమము వీనులవిందొనరింపవిని, కనులారఁగాంచితినో, ఏనాఁడునీదివ్యశస్త్రహతిచే నాపఠానులదండు పటాపంచలైపోయెనో, ఆనాఁడే - ఘోరారణ్యమున - అర్ధరాత్రిమున—పండువెన్నెలవెలుంగున - నిన్ను నేను ప్రేమించితిని! నాప్రేమపుష్పంబుల నీకుఁబూజఁగావించితిని. సుందరుఁడా! ఇఁకనైనఁదెలిసినదా? ఇఁకనైన నాప్రార్థనమంగీకరించెదవా?- ఇఁకనైన నీహృదయమును మార్పునొందఁజేయుదువా?- ప్రియుఁడా! ఆనాటినుండియు నీవు నాకుఁ బ్రియుఁడవైతివి. నాప్రేమను నీహృదయమున డాచికొనియుంటిని. రాజపుత్రా! నాప్రేమను మరల నాకీయవా?

జగ—వీరనారీమణీ! దేశభాషలబాగుగానెఱింగి - సకలశాస్త్రములఁబఠియించి - సర్వధర్మములనేరిచి - జగద్విఖ్యాతమగుకీర్తినిగడించు మీరెఱుంగని విషయములులేవు - మీరెఱుంగని ధర్మములులేవు - మీరెఱుంగని నీతులులేవు. అయినను నాకుతెలిసినదేదియో మరలఁజెప్పెదను. ఆయేషా! మీరుసంపూర్ణయౌవనవయస్కలు - సుల్తాను తనయులు - దివ్యసుందరీమూర్తులని లోకమునఁ బ్రఖ్యాతిగడించిన వారలు. సోదరీ! మీస్వకులముకలదు. మీకులములో ననేకులు మీకుఁ

దగినవారలుందురు. కావున వారిలో నేనుందరునైనం బరిణయమాడి సుఖియింపు(డు.

ఆ.యే— (హేళనాపూర్వకమగునవ్వు) పరిహాసమా ? (సమీపించి) ప్రియుడా! నీవు నాతో వేళా - - -

జగ—ఆయేషా! మీరు నన్ను సోదరేతరభావంబున పరిభోదించి నచో మీవాక్యంబుల నేనువినఁజాలను.

ఆయే — అవునా?-అవునా?-జగత్సింహా!ఇంతనిర్మోమాటమా?-ఇంతటి నిశ్చలత్వమా?—మహాపురుషా! నాసాహసకృత్యములకు నీనిరాకరణముప్రతిఫలమా? — నాయుపకారంబులకీనిరాకరణము ప్రత్యుపకారమా? —గాయముల బాధచే స్మృతిఁదప్పిపడియున్నతరుణమున, నాపరిణయభావప్రోత్సాహితనై, నీకుస్వయముగ సకలోపచారంబులఁ జేసి, నిన్ను ప్రేమించుచున్నందుల కీనిరాకరణము ప్రతిఫలమా?-నీయాత్మబంధువులగు విమలాతిలోత్తములను కారాగారమునఁ బెట్టి నీయుక సర్వవిధసౌఖ్యములనిప్పించుచున్నందుల కీనిరాకరణముప్రత్యుపకారమా?—సాహసికుఁడా! నాసాహసకృత్యములకు నాపైనీకింతకినుకయా? ఇంతకును కారణమునైన నాపైనీకలుకయా? ఏలనాప్రార్థనమంగీకరించవు?— -ఏలనాప్రేమకుఁ బ్రతిఫలంబొసంగవు?—మనోహరా!-

జగ—(ఆశ్చర్యముతో) ఆయేషా! మీరు వీరసుందరులు!—మీయందు నాకపరిమితమయిన గౌరవభావము కుదిరినది.—సోదరీ! గాయముల బాధమిక్కుటమై స్మృతిలేకపడియున్నసమయమున, నాయారోగ్యమునుగోరి - నన్నుగాపాడిననీవు నాకుఁ గేవలముసోదరివగుదువని నాహృదయము పరిబోధించుచున్నది. క్షమింపరానిపరిబలవిరోధిచేతఁజిక్కినపుడు వానిని వధింపక గాపాడి - సర్వసౌఖ్యములనిప్పించుచున్ననీవు కేవలము నాకుసోదరివే? - ఇందులకువ్యతిరేకభావము నాకు కలుగనేరదు - కలుఁగదు - ఇంకమీపరియాసమును మాని మీరరుగుఁడు!—

ఆయేషా — (కోపముతో నొసలుగరచి) జగత్సింహా! బాగుగనాలో చించియే పలుకుచుంటివా? సంపూర్ణముగా యోజించుచుంటివా? నాప్రణయమంగీకరించుటచేనగు నీకుఁ గలుగఁబోయెడిలాభముల స్మరించుకొంటివా?—— చెడిపోకుము - చెడిపోకుము

చ. పతనులరాజ్యమెల్లఁ గర ♦ పాయత నీకు వంశంబుజేతు; సం
తతమును నీకు నస్పృహసి ♦ దప్పకఁ బోరుల వీరకాంతనై
హితమొనగూర్తు; సౌఖ్యముల ♦ నేకములిచ్చెద; నీవు నాకు స
మ్మతమునఁ బెండ్లియాడగను ♦ మాటనొసంగినచో! మనోహరా!--

జగ—ఆయేషా! మీరు వేయిచెప్పినను, నాహృదయము చలింపదు! - నాహృదయమిప్పుడే దానినిశ్చితాభిప్రాయము నెరింగి సంచరించుచున్నది!- ఇంక మీవ్యర్థపుమాటలవలన ప్రయోజనము లేదు! సోదరీ! నామాటనాలకించుము!

ఆయేషా—(మిక్కిలికోపముతో) ఔనా! ఇంతకఠినమా? —ఇంత నిర్దాక్షిణ్యమా?—నేనింతచుల్కనగాఁ గానిపించుచున్నానా?—ఇంకనైన నీమూర్ఖతను విసర్జించవా?—ఇంకనైన నీయభిప్రాయమును మార్చుకొనవా?---అవునా?---ఇంతియేనా?---నన్ను బాగుగా నెరింగియే ఇట్లు నడచుకొనుచుంటివా? --- నన్ను పూర్ణముగా నెరింగియే నిరాకరించి చుల్కనజేయుచుంటివా?—మాస్వభావము నీవు గుర్తెరింగితివా?—కాలసర్పమును గాలదన్నజూచుచుంటివా?---విలయాగ్నికీలల నాహుతికాఁ దలంచితివా? వీరుఁడా! యోజించుకొనుము---బాగుగా యోజించుకొనుము?---

జగ---(చిరునవ్వుతో) ఆయేషా! మీరు నన్నుభయపెట్టజూచుచున్నారా? అబలలకు వెరచునంతటి యధీరులుగారీరాజపుత్రులు! ఎంతటివెఱ్ఱి!

ఆయేషా---(రోషముతో మొలలోఁ గుప్తముగాదాచిన కైజారును

దీసి) శూరుఁడా! గాచికొనుము. నిన్నిప్పుడేవధించి యాలోకమున నిన్ను గలసికొనెదను. (జగత్సింహుని పొడువబోవును.)

జగ—(చిరునవ్వుతో) ఆయేషా! మీయిష్టము! (అనిచలింపక కూరుచుండి) మీరశ్రిమతో నన్నంత మొందింపఁగలరు! - ఇదిగో! —నాశిరస్సు! - (శిరస్సువంచి మెడనొసంగును.)

ఆయే—(ఆశ్చర్యముతో నాకృత్యమునుఁజూచి వెనుకకు రెండడుగులువైచి బాకునవలకుఁబారవైచి) అయ్యో! ప్రాణేశ్వరా! ఎంత ధీరుఁడవు? ఎంత గభీరహృదయుఁడవు! ఈధీరత్వమే నన్నుభ్రమింపఁజేసినది! - ఈధీరత్వమే నన్నింతటిసాహసమును జేయించుచున్నది! - అయ్యో! (తలబట్టికొని జగత్సింహునిపాదములఁబడి) జగత్సింహా! రాజపుత్రా! నన్నుక్షమింపుము! ప్రస్తుతమీప్రస్తావన నిలిపి వేయుదును. దైవమనుకూలుఁడయినచో మరియొకప్పుడయిన నామీద నీకుదయ రాకపోవునా?

ప్రవేశము : ఆస్మాను

ఆస్మా—(ఆయేషా స్థితినిజూచివిసుగుతో నొడుగరచుకొని.) ఆయేషా! ఇది యేమి? అర్ధరాత్రమునబరపురుషునితో మాట్లాడనగునా?

ఆయే—(కోపముతోడను విసువుతోడను లేచి గర్జించుచు) ఈతఁడు పరపురుషుఁడెట్లగును? ఈతఁడు నామనోహరుఁడు!—నా ప్రాణప్రియుఁడు!— నాహృదయేశ్వరుఁడు!—సోదరా?- మమ్ములజూచియు నిట్టియప్రస్తుతప్రవేశమెందులకు?

ఆస్మా—(సమాధానముజెప్పక కోపముతో రెండువైపునకు, జూచుచుండును.)

ఆయే—సమాధానము చెప్ప వేమి?

ఆస్మా—ఉదయంబున పీరేంద్రునిమరణదండనజరుగును. ఆ విషయము మీజగత్సింహునకుఁదెలుపవచ్చితిని.

జగ---అస్మా! ---నాకిదివరకే దెలసినది! ---కాని నీవొక యుపకారము జేయవలెను.

అస్మ—అది యేది?

జగ—విమలనొకసారి మరణసమయమున వీరేంద్రునికడకు గొనిపోగలవా?

అస్మ—విమల నెందులకు?

జగ—విమల వీరేంద్రునిధర్మపత్ని!—తిలోత్తమసవతితల్లి! —వీరేంద్రుఁడు బాల్యంబున తండ్రికివ్యతిరేకముగా నొకబీదకన్యకను వివాహమాడెను. ఆమెకు తిలోత్తముయుద్భవించెను. కొంతకాలమునకు తిలోత్తమతల్లి మరణించుటచే, తండ్రికివెరచి తిలోత్తమపినతల్లిని రహస్యముగా వీరేంద్రుఁడుద్వాహమాడెను. అప్పటినుండియు విమల తిలోత్తమచెలికత్తెవలె లోకమునకు మెలంగుచున్నది. ఈసంగతి నేనెరుంగుటచే వెల్లడిఁజేయవలసివచ్చినది.

ఆయే---అస్మా! - తెలిసినదా! - ఇఁకపొమ్ము! - ఈరాజపుత్రునిప్రార్థనను దోసిబుచ్చకుము!

అస్మ---(విసుగు, కోపము, అవమానము, అసహానము, మోమునఁదాండవింప వెడలిపోవును.)

ఆయే—రాజపుత్రా! ఇంకనాకు సెలవిమ్ము! మరియొకప్పుడు కలసికొందుములే!—

ప్రత్యుత్తరమునకు వేచియుండక నిష్క్రమించును.

చ తు ర్థాం క ము.





శ్రీ రామచంద్ర

# ఆయేషా

## పంచమాంకము.

రంగము : వధ్యశిల.

ప్రవేశము : వీరేంద్రుడు; తలారులు; వీరేంద్రుని వధ్యశిలపై గూరుచుండ బెట్టికత్తుల నూరుచుందురు.

ప్రవేశము : ఆస్మన్ ; విమల.

విమ---(పరువిడుచు వీరేంద్రసింహుని పాదంబులపైఁబడి ఏడ్చుచు) హా ప్రాణేశ్వరా! హా! మనోహరా! హా! —హా!---నేఁడు నన్ను బాసి పోనుంటివా? నేఁడు నీయర్ధాంగిని-నీధర్మపత్నిని - విడనాడుచుంటివా? అయ్యో! నేటితో నీకునూరేండ్లు నిండెనా? నాథా! ప్రాణేశ్వరా! నేటితో నీగరమందిరదుర్గమును - నీప్రజలను - నీహితులను వదలివేయుచున్నావా? కటకటా! ఏపాపపుణ్యంబుల నెరుంగని నీవు- నిష్కారణముగ నీపతనదురహంకారాగ్నిజ్వాలలఁబడి భస్మమై

పోవుచుంటివా? అయ్యో! ప్రాణేశ్వరా! మీరాజనకునియభిప్రాయము నకు వ్యతిరేకముగ నన్ను బరిణయమాడి, పరిచారికావేషంబున నేరికి నిదెలియరానివిధంబున నీయంతఃపురంబున నన్ను బ్రవేశపెట్టితివి! - కట కటా! ఎన్నడో నీదేశమునకుఁ గష్టములన్నియుఁ దొలఁగుననియు, నేన ప్పుడు నాపరిచారికావేషమునువిసర్జించి స్వేచ్ఛనొందవలయుననియు, నూహించుచుండ—అయ్యో! ప్రాణేశ్వరా! తుదకీపరిచారిక కిట్టిగతి సంప్రాప్తించుచున్నదా? అక్కటకటా! మీప్రేమ నెందుల విడచిపోవుచు న్నారో! అయ్యో!—(ఏడ్చును.)

ఆస్మ—తలారులారా! ఈమె భర్తృజీవితముకొరకు విచారింపు చున్నది! మనముదూరమున నావృక్షముక్రింద వేచియుందము. రండు!

వీరే. —(విమలను లేవనెత్తి ఆలింగనముచేసికొని) ప్రేయసీ! విచా రించిన లాభములేదు. నేనుఎరుంగక చేసిన పాపఫలమో - నాపూర్వ జన్మకృతకర్మప్రతీకారమో - నేనీవిధమున మరణింపవలసి వచ్చినది. విచారించిన లాభములేదు! (విమలనుజూచి ఆలింగనము విడచినిర్వేద ముతో) ప్రేయసీ! పొమ్ము! —పొమ్ము! —వలదు! —నన్ను జేరవ లదు!—పొమ్ము! —మరణసమయమున నీసుందరముఖావలోకమున బూర్వస్మృతినిగలుగ జేసి దుఃఖమునుసమకూర్పకుము—పొమ్ము! — నన్నాపరమపురుషుని ధ్యానించుకొననిమ్ము!—వలదు!—వలదు! — ప్రేయసీ!—పొమ్ము!

విమ— (ఆశ్చర్యభయములతో వెనుకకు రెండడుగులువైచి) ప్రాణేశ్వరా!—ఎచ్చటికిఁబోగలను! — మిమ్ములవిడచి యెచ్చటికరుగ గలను! —నేనును మిమ్మనుసరింపవలసినదాననేకదా! —హృదయాధి నాథా! మిమ్మనుసరించుటకు నాకనుజ్ఞనొసగుఁడు!—పతివ్రతలధర్మము ననుసరింప నాకనుజ్ఞనొసగుఁడు!

వీరే—వలదు!—వలదు! — ప్రేయసీ! —వలదు—ఎందులకో

నీకే తెలియును!—నాతనయ-తిలోత్తమ- అయ్యో! —మరలపూర్వ స్మృతి కలుగుచున్నది!—ఆమెనునీవు గాపాడవలెను! — వేగమే పొమ్ము! —ప్రేయసీ! - కాలమ మయాల్యమైనది! - (కనులమూసికొని ధ్యానగరిష్టుడగును.)

విమ—(ఏడ్చుచు.) ప్రాణేశ్వరా! ఆవిషయమైభయ మిసుమంతయు లేదు! - ఆమె జగత్సింహుని గాంధర్వవిధిని బెండ్లియాడినది!- అయ్యో! పాపాత్మురాలను!— నాతప్పులు క్షమింపరా?— నానా హాసకృత్యముల క్షమింపరా?—

వీరే—(ఆశ్చర్యముతో) విమలా!— ఇందువలన నాకుసంతోషమే కలిగినది!—ఇంక నేను నిర్విచారముగా ప్రాణములువిడచెదను.

విమ— అయ్యో!ప్రాణేశ్వరా! ఇంతకునుమూలకారణమునైన నన్ను, క్షమింపరా? పతివ్రతలధర్మానుసరణిని మిమ్మనుసరింప నాకనుజ్ఞ నొసంగరా?—కటకటా!—

సీ. వెనువెంటనరులంటి ♦ విభునింటబడకంట
అనదనైయున్న దు ♦ ష్టాత్మురాల;
ప్రభులోకమరిమూక ♦ బడ వేగమృతిలేక
హాయినందెదు కదే ♦ నాత్మురాల;
వనవీరు రణధీరు ♦ వతనారు నరిబారి
కర్పించియుడలుపా ♦ పాత్మురాల;
రణధాటి విభుపీటి ♦ ప్రతికోటి వనవాటి
నలరింపమనెదు మా ♦ ఘాత్మురాల;
గీ. స్వామిమరణంబుఁజూచుచు ♦ చావురాక
అక్కటా! వెర్రినా చకి ♦ తాత్మురాల;
బోరివవే! నన్ను వెంటగొం ♦ పోవదేమి?
నరవిబల్కుమ నీకడ ♦ సారిమాట!—

హా!—ప్రాణేశ్వరా? పలుకవేమి? అయ్యో!—(యేడ్చును.)

వీరే—(విసుగుతో) నాకంతయునిదివరకే బోధపడినది. కాని జరిగినదానికై విచారించిన లాభములేదు. తిలోత్తమ జగత్సింహుని వివాహమాడినన సంగతి నాకుసంతోషకరమే యైనను, ఇన్నిటికిని - ఇట్టియనర్థములకు నీవయేకారణభూతురాలవనుట నాకు విచారమును కలిగింపకపోలేదు! విమలా! నీవు నాకు నిజముగాసంతోషమును కలుగ జేయవలెనన్న - నేను నిర్విచారముగా మరణింపవలయునన్న - నా వెంటవచ్చుటకు - పతివ్రతాధర్మమనుసరించుటకు నేనంగీకరింపవలె నన్న - నీవొక్కటిచేయవలెను—

విమ—(ఆశతో) ఆహా! ఎంత దయాళుఁడవు? మనోహరా! ఎంత ప్రేమైకమూర్తివి?

వీరే—నాయాజ్ఞను పరిపాలింతువా?

విమ— సేవకురాలను. సిద్ధముగా నున్నాను.

వీరే—ప్రాణేశ్వరీ!—వినుము—

ఉ. పోరొనరింపలేక పగ ♦ బూనుచు మాయలనన్నుబట్టి, యీ
తీరున మారణంబునువి ♦ ధించు ఖతల్ కలుషాత్ముఁ జంపి, నా
కారుధిరంబు తర్పణము ♦ నందగఁ జేసిన నేను హాయిగా
నీరతిఁ జచ్చెదన్; అనుమ ♦ తింతువు నీదుమనోభిలాషమున్!

(సాలోచనగా విమలను జూచును.)

విమల—(సంతోషముతో) ప్రాణేశ్వరా! మీకోర్కె నిముసములో నెరవేర్చెదను - అఖతల్ ఖానుని- ఇదిగో! (కైజారునుదీసి) యీయాయుధముతోడనే వధించివైతును!—దురాత్ముఁడు!—హంతకుఁడు!—పాపి!—ఈయాయుధమున వానినివధించివైచెదను!—వాని రక్తధారల నీకు తర్పణమువిడుతును!—ఇదియే నానిశ్చయము!— ఇదియేనా యభిప్రాయము!—వానిదుశ్చర్యలకు- వానిదురహంకార

మునకు- వానిమరణమే ప్రతీకారము!—ప్రాణేశ్వరా!— ఇదిగో!—నేను ప్రతిజ్ఞఁ బూనుచున్నాను!—మీరక్తమీప్రదేశములఁ బారకమునుపు నారక్తధారచే నీప్రదేశమును దడుపనిమ్ము!—(సాహసముతో కైజారుతో హస్తమును జీల్చికొని రక్తము నిటునటుఁజిలికి వీరేంద్రునకు బొట్టుపెట్టి) ప్రాణేశ్వరా! ఇఁకమీరు స్వేచ్ఛగా ప్రాణములనువిడువుఁడు! —ఇంకమీరునిర్భయముగా - నిర్విచారముగా మరణించ వచ్చును!—ఈహస్తముపైని గాయముమాను నెట్టకపూర్వమే ఆమురాత్ముని వధించెదను!—ఇదియేనాప్రతిన!

వీరే—(సంతోషముతో విమలనాలింగనము జేసికొని) మనోహారీ! ఇఁక నేను సౌఖ్యముగా ప్రాణములనువిసర్జించెదను. నాకు సంతోషమైనది. ఇఁకనరుగుము!—

విమ—(రెండడుగులు వైచి) ఓభగవానుఁడా! నామాత, నా భారతాంబ, నీయెడలనొనరించిన యపరాధ మేమి? స్వార్థమునకు యోజించుచు, అధికారప్రాపకమునకుఁ బాటుబడుచు, ఈక్రూరాత్ములఁ జేతలకు ప్రోత్సాహముగావించి, దేశక్షోభమునకు మూలకారకులయిన మాతృద్రోహులుండ - నీవేల నిష్కారణముగ, స్వార్థత్యాగులను, దేశసేవాపరాయణులను మృత్యుదేవతపాట్టను బెట్టజూచెదవు?

వీరే—ప్రాణేశ్వరీ! ఆలస్యమగుచున్నది. ఇఁక నీవరుగుము.—

విమ—(వీరేంద్రుని కౌగలించుకొని, పాదములకునమస్కరించి) జీవితేశ్వరా! శలవు—(లోనికిఁజూచి) అస్మన్ జీ!—

అస్మ—(ప్రవేశించును.)

వీరే—ఇఁకమీకార్యమునకు గడఁగవచ్చును.

తలారులు ప్రవేశింతురు: అస్మన్, విమల, వెడలి పోదురు. వీరేంద్రుఁడు వధ్యశిలపయిఁ గూరుచుండును. ఖాజీ ఖురాన్ చదువును. తలారులు వీరేంద్రునిమస్తకము నఱకివైతురు.

విమ—(ఏడ్చుచు బరుగునవచ్చి వీరేందు్రిని మొండెమును కౌగలించుకొని లోనభగవంతునిప్రార్థించి వానిరక్తమును నొసటబొట్టుపెట్టుకొని శరీరమునసలుకొని వికృతముగా నవ్వుచుండును.)

ఆస్మా—(ప్రవేశించి ఆశ్చర్యముతో) విమలా! ఇదియేమి?

విమ—(వికృతముగా నవ్వును.)

ఆస్మ—(విస్మయముతో) విమలా! మతిపోయినదా యేమి?

విమ—(నవ్వుచు) ఇదిమావంశాచారము! ఆస్మా! ఇంక నడువుము— (విమల, ఆస్మా, నిష్క్రమణ)

రెండవరంగము : వీధి

ప్రవేశము : మీర్ ఖాన్; షర్ ఖాన్;

మద్యపాత్రముతో

మీర్ (తూలుచు) రే! షర్! మన్కీ మొహ్రింకీబలేబలేహుషార్ హుందిరే! హిందీరోజ్కీ మన్కీ పానాల్కీ బహూత్ షుఖం సెప్తుందీరే!

షర్—అరే! మీర్ ఖాన్! మన్కీ హీరోజ్కీ హిందీసారా, దారూనహీ సెప్తేసాలా సాలా (తాగుచు) సాలా - - - - (తూలును)

మీర్—అరే! షర్!—సాలా రే! —నీకీసాలా—నీదాడీకీ సాలా! నీదారూకిసాలా! నీకీసాలాసాలా_అరే! నాకీబహూత్ మాటల్ సెప్తావ్ రే!

షర్—అరేనీకీ సెప్తే బుద్ధీ లేదూ! అరేనాకీదారూ షంగత్వాల్ సెప్తేనాకీసాలా—సాలా—

మీర్—నాకీబుద్ధీలేదూ! అరేనాకీసాలాసాలాహానిసెప్తాహై రేనీకి సువ్వార్ లాగుహున్నావ్ బె!—

షర్—హా రే! అర్ ర్ ర్ రె! (తాగుచు) నిస్కూనల్పీ యేస్తాక్–. సారాకీనీకీసంపీ యేస్తాన్—(కలియఁబడును)

మీార్—నాకుదిల్ లేదూ సెప్పింది లాగాహుంది నీకీ (కలియఁ బడి ఇరువురు పోట్లాడుదురు.)

ప్రవేశము : అప్ జుల్ ఖాన్

అఫ్—అ రే! మీాకీబుద్ధి లేదూ! హక్దాసుల్తాన్ జీగారిదగ్గిరి భోగం—హోటల్—గీటల్—హుషార్ సేస్తూహుంది—మీాకీబలే లడాయ్ సెప్తాక్—అ రే! మీాకీబహూత్ అచ్ఛాముసల్మాన్ లాగా హుందీ! (యిరువురను చెరియొక చరపుఁచరచి లేవదీయును)

మీార్—(తెల్లబోయి లేచినిలచును)

షర్—(మరియొక వైపున కేగి దారూపాత్రి గ్రహింపఁబోవును)

అప్—(షర్ ఖానుదగ్గరనున్న మద్యపాత్రను గ్రహించి) హా రే! నీకీదారూ, సారావద్దు రే! అ రే! సుల్తాన్ సర్కార్ దర్బార్ మే మంచీ మంచీ హోటల్ - పాటల్ - హుషార్! - మన్కి మొహంకీ ప్యారి హుండావాలి! - లడాయ్ వన్కీ రాద్! - తాగీ - తాగి - ప్యార్ మన్కీ అచ్ఛాసంతోషం - అహ్హా హ్హా హ్హీ హ్హా హ్హా!

షర్—సుల్తాక్ సర్కార్ దర్బార్ మే - హోటల్ - పాటల్ హుందీ?—

అప్—(నవ్వు) అ రే హీంష్లూ లేదూ రే! సుల్తాన్ సర్కార్ నిద్ద ర్కీ పెల్లీపోయిందీ—

మీార్—అ రే! భాయ్! మన్కీ కూడా యెల్లీపోతుందీ రే!

(నిష్క్రమింతురు.)

—————

తృతీయరంగము : సుల్తాన్ శయ్యాగారము.

ప్రవేశము : ఖతల్‌ఖాన్, మద్యపానమత్తుఁడై.

ఖత — (తూలిపోవుచు) ఆహా ! మాకీ మొహరముపండుగయెంత యానందదాయకము ! సంవత్సరముపొడుగునను మేము శెందియున్న కష్టములన్నియు నీదినముతో మరచిసుఖింతుముకదా ! మాకీదినమున — మాంసాహారములు - మద్యము - వారె !- ఇంకా - ఇంకా - చాలా- సౌఖ్య-ములు - (కన్నులునలుపుకొనుచు) నాతల - గిర్ ర్ ర్ ర్ ర్రున - తిరుగుచున్నదేమి ? అరె ! ఏమి - ది? (బల్లపైనున్నమద్యమును గ్రోలి) అహ్హాహ్హా ! ఇప్పుడు - కొంచము హుషార్ గా-ను-న్న-ది ! (ఇటునటు పరికించి చేతిలోనిమద్యపాత్రను జారవిడచి) నాకు - హుషార్ - గా- ఉ - న్నది (ఇటునటుజూచి) ఈగది అంతా - అల్లరిగా ఉన్నదేమి?- ఈగది - అంతా - అల్ల - రి - చేయు - చున్నది. (బల్లమీదగ్లాసులనిటునటువిసరివైచి) ఇక్కడ - అంతా - అల్ల - రి - (మరియొకప్రక్కకేగి చీకాకుతో) ఛీ! ఏ - మి - ది? నాక - న్ను - లు తిరిగి - పోవు - చు - న్న - వి? (దోమతెరలచించి) ఇవిఅన్నియు - నాకు - పి - శా - చములవలె - ను - న్నవి (క్రిందచతికిలఁబడిపరుండి) పిశాచములు - పి - శా - చ -ములూ - - - - (కనులుమూసికొని) పి - శా- - - చ- - - ము- - - (ఉలికిపడిలేచి) పిశాచీ! - (బల్లదగ్గర కేగి దానిని చూచుచు) రమ్ము! - పిశాచీ! - నిన్ను - చంపెదను (బల్లతోకుస్తీపట్టును) ఇది - పిశాచి - (బల్లతోక్రిందబడి చేతికిదెబ్బతగులగానే తెలివికలుగును) అహ్హాహ్హాహ్హాహ్హా! వారె! వారె! నేను మంచి తెలివిగలసుల్తానును ! బల్లపిశాచియనుకొనిపోరాడుచున్నాను ! (ఆలోచన) ఇంకను మనస్సునకానందము లేదు. (మరలమద్యమునుద్రాఁపి) ఇప్పుడు ఆనందము-(తూలుచుక్రిందపరుండియిటునటుపొరలుచు) పి - శా - చీ - ఈ - ఈ - ఈ - ఈ - ఈ - (కనులుమూసికొని లేచి

కూర్చుని చేతులజాపుచు) అరే! వీరు - యెవ్వ - రూ - - -! త-ల-
లేదు! - మొండె - ము - (భయము) ఇది - నిజముగు - పిశాచి- (ప్ర
క్కనున్న కుమ్మరతొట్టిని కౌగలించుకొనిదానితో దొరలుచు) పి - శా-
చీ! - నిన్ను - న - లి - పి - వే - సెదను - (నిదురించి, కొంతసేపూ
రకుండి ఉలికిపడిలేచి) నాకీగది - అంతా - సైతాన్ - వలె -
(కన్నులునలుపుకొని) నాకన్నులు - నన్ను - మోసము - చేయు -
చు - న్న - వి - (లేచి రెండడుగులువైచి యిటునటుభయముతోఁ
జూచుచుండును)

ప్రవేశము : విమల.

కైజారుతో రహస్యముగా

విమ—(తనలో) చక్కనిసమయములభించినది. ఈదుర్మార్గుఁడు
మద్యపానమత్తుఁడయి తనమరణభావముతో నవస్థలనొందుచున్నాఁడు.
నాస్వామికార్యతత్పరనయి - ఈదుర్మార్గునంతమొందించి - నాప్రాణేశ్వ
రున కాత్మశాంతి నెలకొల్పెదనుగాక! (వేచియుండును.)

ఖుత—(ఇటునటు వెర్రిచూపులుజూచుచు భయముతోఁ జేతు
లడ్డముపెట్టుకొనుచు వెనుకకుజరుగుచు) ఏమిది? - ఏ - మి - ది? - ఏ
- ఏ - ఏ - మి - ది? - వీఁడెవ - డు? క త్తి - ఉ - న్న - దే!
క త్తి - క త్తి - క - త్తి - ఉ - న్ - న్ - న్ - న్ - న్న - దే! నన్ను
- చంపులకు - (భయము. వణకు) అమ్మో! వీనికి - తల - లేదు? -
మొండెము -- (బ్రతిమాలుట) అరే! నన్ను - చంపకుము. చంపకు
ము - వద్దు! - వద్దు! - నేను సుల్తాన్‌సర్కార్‌ను - ఖుతల్‌ఖానుఁడను -
రాకుము - రాకుము - (భయమున, రెండుచేతుల కనులమూసికొని)
వీఁడు - వీ రేంద్రి - సిం - హు - ని - వలె - నున్నాఁడు! - వీనిని - ని
ష్కారణముగ - చంపించి - నాను. - మరణశిక్ష - విధించినాను. అం
దులకే (వెనుకకు జరుగుచు) నన్ను - పొడిచి - అయ్యో! - (చేతులను

చూచి బ్రితిమాలుట) వీరేంద్రా! సింహా! వద్దు! - చంపకుము - చం - ప - కు - ము. నీను - ర - ణ శిక్ష - రద్దు - చేసెదను. వీ - రేం - ద్ర - సిం - హా! నీ - శి - రస్సును - యి - చ్చెదను— (క్రిందకొ యొరిగి) వీ - రే - ప - ప - ప - ప - ంద - ర్ - ర్ - ర్ - సిం హా - ఆ - ఆ - ఆ......! తల - త - ల - ......... పి - శా - చ - ము. (నిదురించును.)

విమ— (సంతోషముతో) దురాత్ములీలోకముననే తాముచేసిన దుష్కార్యములకుఁ దగినట్లనుభవింతురనుట కీఖతల్ ఖానునిచర్యయే తార్కాణము. అనుభవము!—

ఖత—(నిద్రలో) వీ - రేం - ద్రా! - చంప - వ - లదు!— నీ - శి - ర - స్సు - నిచ్చె - దను-

విమల యిటునటుపరికించి, యిరుగుపొరుగున
నెవరును లేనిసంగతి ధృవపరచుకొని ఖతల్
ఖానుని పొడుచుటకు సిద్ధముగా నుండును.

ఖత—(నిద్రలో) వీ - - - - రేం - - - దర్ - - - సిం—హా!—వీరేందర్ - - సిం - - హా! - - - వీ - - రేం - - ద - ర్ - ర్ - ర్ -

విమల—(కోపముతో) క్రూరాత్మా!—నేనే వీరేంద్రసింహుఁడను—కాచికొమ్ము!

ఖతల్ ఖానునివక్షమునఁ గైజారునుగ్రుచ్చి పారిపోవును.

చతుర్థరంగము : ఆమేషాశయ్యాగారము.

ఆస్మత్, ఆసీనుఁడై

ఆస్మ—(ఆలోచన : నిట్టూర్పు) తుదకు మాసుల్తాన్ సర్కార్,

కూడ మరణించెను. వారిని హత్యగావించినదెవరో? - మద్యపానమత్తు లైన పఠాను లినుమంతయుఁ గనుకొన *జాలరైరిగా? కానిమ్ము. విధి లిఖిత మట్లున్నది. ఇఁక మా ఆయేషా పరభార్య కానున్నది! - - - - ఛీ! ఛీ! ఏమి నా జీవితము? కడలేని యిడుమలఁ గుడిచి, శత్రుమారణమే నా జీవితాశముగ నేర్పరచుకొని, నా రాజ్యమున నత్యున్నతపదవి ననుభవించుచుండియు నాకు మనశ్శాంతి లభింపదయ్యెకదా! మొదటినుండియు నేనాయేషాను ప్రేమించుచు, అమె-ఆమె నన్ను బరిగ్రహించునని తలంచుచుండ, ఆమె తలంపు లా రాజపుత్రునిపైని బ్రసరించుచున్నవి. అరాజపుత్రుఁడు నామార్గమున నడ్డుగనిలచియున్నవాఁడు! ఆయేషా చంచల హృదయ కాదు. ఆమె యభిప్రాయమునుమార్చుకొను ననుటకల్ల! ఏమైన నామెనుమరలఁబరీక్షించి అనంతరము నానిశ్చితమును స్థిరపరచుకొనెదను. (దీర్ఘాలోచన)

ప్రవేశము : ఆయేషా

విచారహృదయము

ఆయే—ఆస్మా! విమలాతిలోత్తమలను వారికోటయందు జేర్చి రమ్మనియు, జగత్సింహుని విడచిబుచ్చుమనియుఁ జెప్పితినే! అట్లొర్చితివా?

ఆస్మా—విమలాతిలోత్తమలను గరమందిరమునకు సురక్షితముగాఁ బంపినాను. జగత్సింహుఁడును బ్రయాణమగుచున్నాఁడు. అచిర కాలములోనే యిచ్చటికి రాగలడు!—కాని అయేషా! చేతఁజిక్కినశత్రువుల నీవు విడచుట నాకుఁజాలవింతగానున్నది!—

ఆయే— అన్యాయముగ పరులనుబాధించుట నామతముకాదు. అందువలన వీరలవిడచి గరమందరమును తిలోత్తమకు స్వాధీనముచేసినాను. కాని, ఆస్మా! మనకోటయొవలివరకును నీవా జగత్సింహుని సాగనంపిరావలయును జుమా?

ఆస్మ—కోటయువలివర క్షేమి? - ఇంకను చాలదూరము సాగనంపివచ్చెదను. కాని అయేషా ! - (యూరకుండును.)

ఆయే—ఆస్మర్ ! - ఏమి? - బలుకవేమి ?

ఆస్మ—(నిట్టూర్పుతో) ఆయేషా ! సుల్తాన్‌జీ అకాలమృత్యువువాతఁ బడెనుకదా!-ఇఁక నీవు సర్వాధికారిణివి!-

ఆయే—అయిన నేమి?

ఆస్మ—నీహృదయ మిఁక నైసమాగ్నినొందిన దేమోయని- నీవన్నిప్పటికైనఁ బ్రేమించి వివాహమాడుదువేమోయని - ఆయేషా!-

ఆయే—సోదరా! - నాహృదయము చంచలమైనదని యనుకొనుచుంటివా ! ఆస్మన్! ఇఁక నీయభిలాషను విసర్జించుము !

ఆస్మర్—(కోపముతో లోనవిసుగుకొనును.)

ప్రవేశము : జగత్సింహుఁడు

ఆయే—(లేచి మేలిముసుఁగు సవరించుకొనును.)

జగ—(తలవాల్చి) ఆయేషా ! నేను ప్రయాణమునకు సిద్ధుఁడనై మీతోఁజెప్పిపోవుటకు వచ్చితిని.

ఆయే—రాజపుత్రా! - నీకు శుభముకలుగుగాక ! గరమందిరము నిన్నుకోరుచున్నది. విమలాతిలోత్తములింతకుముందే యేగినారు? మేమును, ఆనాటికచ్చటికరుదెంచి, మీపట్టాభిషేకమును కన్నులారఁగాంచి సంతోషించెదము. (సాభిప్రాయముగాఁజూచును.)

జగ—అంతకంటెమాకుఁ గావలయున దేది?

ఆస్మ—జగత్సింహా!—ఆలశ్య మగుచున్నది! రమ్ము పోదము!

జగ—ఆయేషా!—నాకు శలవొసంగెదరా?

ఆయే—అటులనే—

(ఆస్మర్, జగత్సింహుఁడు, నిష్క్రమణ.)

ఆయేషా విచారముతో మేలిముసుగునుదీసి
దూరముగావిసరివైచి గూర్చుని దీర్ఘాలోచనా
ఘరుర్ధాలగును.

పంచమరంగము : వీధి,

ప్రవేశము : ఆస్మాన్; జగత్సింహుఁడు;

జగ—ఆస్మాన్! — కోటవిడచి చాలదూరమరు దెంచితివి? —

ఆస్మ—ఎంతదూరమరు దెంచితిని?—ఇప్పుడే వెడలిపోవుదును-

జగ—ఇఁక నే నరిగెదను. ఆస్మాన్! - నీవుండుము —

ఆస్మ—జగత్సింహా! నేనునీతో నొకరహస్యమును మాట్లాడవలయునని యింతదూరమువచ్చితిని.

జగ—(సాభిప్రాయము) ఆస్మాన్!— సందేహించెద వేల?— చెప్పుము. సావధానుఁడనై యున్నాను.

ఆస్మ—ఇచ్చటకాదు. కొంచెమవలికిపోదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

రంగము : అడవి

ప్రవేశము : ఆస్మాన్, జగత్సింహుఁడు:

ఒకచోట చితి పేర్పఁబడియుండును. ఇంకొకవైపు
న నొకగోయి యుండును. రెండింటియొద్ద చెరి
యొకఖడ్గ ముండును.

ఆస్మ—(వాటినిజూపుచు) రాజపుత్రా! వాటిని జూచితివా?

జగ—(ఆశ్చర్యముతో) ఆస్మాన్!—ఇదయేమి?

ఆస్మ—(దీర్ఘమగు నిట్టూర్పుతో) జగత్సింహా! (గోతిని జూ

ళుచు) మసల్మానులు మరణించునపు డిందుబెట్టి సమాధిఁజేయుదురు. రాజపుత్రులుమరణించునపు డీచితిపైఁబెట్టి భస్మముచేయుదురు!

జగ—వీటిని నాకుఁజూపుటలో నీయుద్దేశ మేమి?

ఆస్మ—(గద్గదస్వరముతో) రాజపుత్రా! ఇంతకును - కారణము నీవు!—జగత్సింహా!—చిన్ననాటినుండియు నేనా యేషాను బ్రేమించి, యింత వరకామెపై నేనాసగొని యున్నాను. అందులకాటంకముగ - నాయభి ప్రాయము నెరవేరదని - నేనెరుంగఁజాలక - కడుసంతసించుచుంటిని. కాని, నాయభిప్రాయమునకు విఘ్నముకలిగించి, నన్ను నిరంతరచింతా నిమగ్నునిఁజేసి, నాజీవితకాలసౌఖ్యమునకు విఘ్నమునాపాదించువాఁ డొకడుబయటికివచ్చినప్పుడు నాయభిప్రాయ మెట్లుండును? జగ త్సింహా! - ఆపురుషుఁడెవ్వఁడో దెలియునా? - ఆపురుషుఁడవునీవే! (ఈర్ష్యతోఁజూచును.)

జగ—(అదరిపడి) ఆస్మన్!—నీవు పొరపడుచున్నావు?— ఆయేషా నాకు సోదరివంటిది! - నేనామెనన్యథా ప్రేమించుటలేదు! - నాప్రేమ సోదరీప్రేమయే!

ఆస్మ—వీరుఁడా! - నీవామెను ప్రేమించకపోయినను, నిన్నామె హృదయేశ్వరుగాఁ బ్రేమించుచున్నది! అందువలన నీస్వరూప మెంత కాలమామెకన్నులకుఁ గనబడుచుండునో, అంతకాల మామెనన్ను వరింపఁజాలదు. ఆమె నిన్నుదప్ప మరియొకరిని వివాహమాడదు. నిన్నామెవివాహమాడినచో నాజీవితము వ్యర్థము. నేను మరణించవల సినదియే!— తెలిసినదా? జగత్సింహా! ఆమె నిన్ను ప్రేమించుచున్నది. నేనామెను ప్రేమించుచున్నాను. ఈప్రేమ మనయిరువురుపై నాధార పడి యున్నది. నేను బ్రతికియుండగా ఆమె నిన్నువివాహమాడజాలదు! నీవుబ్రతికియుండగా నే నామెనువివాహమాడజాలను! (కత్తులనుదీసి యొకటి జగత్సింహునికిచ్చుచు.) జగత్సింహా! మనయిరువురమును

బ్రికియుండుట ఆమెమనోశాంతికి భంగకరము! మనయిరువురలో నెవ రుమరణించినను ఆమె సుఖించును! నేను మరణించినయెడల నీవామెను సుఖముగా. పెండ్లియాడవచ్చును. నీవుమరణించినయెడల, ఎన్నటి కైన నాయేషాహృదయము నాపైఁదిరుగగలదేమోయని నాకున్నది. రాజపుత్రా! ఈఖడ్గము నందికొనుము!—— మనయిరువురమును గలసి యుద్ధముజేయుదము! ఇచ్చట యెరులెవ్వరును లేరు. ఈయుద్ధములో నేనుమరణించినయెడల నీవే స్వయముగా నన్నిసమాధియందుఁ బూడ్చి పెట్టుము!—— నీవుమరణించినచో నీచితిపై నిన్నుదహనముచేసెదను!- ఈకలహ మెవ్వరికినిఁదెలియరాక నతిరహస్యముగా నుండును. ఇప్పుడీ చిహ్నములసంగతి బోధపడినదా?

జగ——(ఆశ్చర్యసబుద్ధై) ఆస్మన్‌ఖాఁ!-. నీచరిత్ర కడుచిత్ర ముగానున్నది? నేనామెను ప్రేమించుటలేదని త్రికరణశుద్ధిగా నింతకు ముందే తెలిపితిని!-నాజీవితములో నేనామెను వివాహమాడఁజాలను! ఆస్మన్‌ఖాఁ! నీవింతటిసాహసకార్యములను జేయనగత్యములేదు. నేని ప్పుడే వచ్చి ఆయేషాకు బోధించి నిన్నువివాహమాడునట్లుఁ జేసెదను. ఈసాహసమును మానుము.

ఆస్మ——జగత్సింహా! నీబోధన లామెకడఁ బనికిరావు. ఆయేషా హృదయ మచంచలమైనది! నేనావిషయముల నన్నిటినివదలి, చివరకీ సాహసమును జేయుచున్నాను. ఇదిగో! ఖడ్గము! గైకొనుము! - కాల మమూల్యమైనది! యేరికిని దెలియకుండగనే యీపోరుజరుగవలెను——

జగ——మనము సఖ్యతగానుండవలదా?

ఆస్మ——ఆయేషాప్రేమ మమూల్యమైనది! - నాకామెప్రేమ ముందట నివన్నియుఁ తృణప్రాయములే! కావున రణముతప్పదు. ఈఖడ్గ మునందికొనుము——

జగ——(చిరునవ్వుతో) ఆస్మన్‌ఖాఁ! ఎంత తెలివిమాలిన యా లోచనము చేసితివి? నీకీవిషయములన్నియు తృణప్రాయములైనను,

నాకామాత్రము యుక్తాయుక్తము లేదా! నీవెన్ని చెప్పినను నేను మన యీనూతనసఖ్యతను, చెడఁగొట్టలేను. నేను నీతో యుద్ధము చేయఁ దలచికొన లేదు!-

ఆస్మ — నేను పతనుఁడను! క్రూరుఁడను!- పాపకార్యాచరణమునకు వెనుదీయను! - ఆయేషా నిన్ను ప్రేమించుటచే, ఆయేషాదృష్టులు నీపైఁ బ్రసరించుటచే నేనును నిన్ను మన్నింపవలసివచ్చినది. నిన్నీవరకే అంతమొందించియుందును. ఆయేషాయందు నాకున్న గౌరవభావమే నిన్ను రక్షించినది. ఆభావమే నిన్ను ధర్మయుద్ధమునకు రమ్మని కోరుచున్నది. జగత్సింహా! నీవు నా ప్రార్థన మంగీకరింపవేని మరియొక గత్యంతరము లేదు. రణము తప్పదు. ఇరువురలో నొకరు మరణించుట తప్పదు. ఆలస్యము వలదు. ఈఖడ్గమును నీవు గ్రహించినను గ్రహింపకపోయినను నానిశ్చితమును నెరవేర్చుకొనెదను. (కత్తిని జగత్సింహుని సమీపమునఁ బడవైచి తన యాయుధము పదనుఁ జూచుచుండును.)

జగ — నీవు వేయి చెప్పినను నే రణమున కంగీకరించను. ఆయేషా యందు నీకున్న గౌరవభావమునకు నేనెంతయు సంతసించితిని. ఆయేషా యందు, నాకున్న గౌరవభావమే నన్నీ యుద్ధమున కంగీకరింపఁ జేయుట లేదు. ఆస్మన్!- ఖడ్గమును నాదగ్గర పడవైచి నీవు రణోన్ముఖుఁడవైనంత మాత్రమున నాకేమి? నీతో పోరొనరింపకపోవుటకు మరియొక ముఖ్య కారణము గలదు. ఏమందువా?—

చ. కరుణను వీడి పల్లెలను ♦ గాలుచు క్రూరుల మిమ్ముఁ జుట్టి మో
హరమొనరించి మారణవి ♦ హారమొనర్చిన నేను జిక్క, సో
దరమునఁ గాచి ప్రాణముల ♦ దానమునిచ్చిన నిన్ను దాకి యే
పరణిని పోరొనర్తు! నిక ♦ చాలును; మానుమ నీదుకార్యమున్!-

ఆస్మ! - ఇట్లంటివని నన్నొక భీరునిగాఁ దలంచకుము.

ఆస్మన్ — నీ ప్రత్యుత్తరముతో నాకు నిమిత్తము లేదు. నీవు యుద్ధ

మునకువచ్చినను రాకపోయినను నేనే నాకార్యమునకుఁగడంగెద. (కత్తి నిటునటు దిప్పుచు) జగత్సింహా! నేను యుద్ధమును ప్రారంభించుచున్నాను! ఖడ్గమునందికొనుము! లేనియెడల నిన్ను వెంటనే వధించివైచెదను.

జగ.—అస్మత్! నీవెన్నివిధములఁ జెప్పినను నేను నీతోఁ బోరొనర్పను. అట్లంటివని నేనీరణవిముఖుఁడ ననుకొందువేమో? నేను విముఖుఁడనుగాను - సుముఖుఁడను గాను - విముఖుఁడనని పారిపోను - సుముఖుఁడనని యుద్ధమును జేయను. అస్మత్! ఇదిగో యిచ్చట నాసీనుఁడనగుచున్నాను. నీవిదివరలో నిచ్చిన ప్రాణదానమును మరల గ్రహింపఁదలచినచోఁ దీసికొనుము సర్వసిద్ధుఁడనై యున్నాను. ప్రాణదాతలతోఁ గలహించుట మాపద్ధతికాదు (గూర్చుండి) అస్మత్! ఇఁక నీయిష్టము—

అస్మత్—(విసువుతో) భీరుఁడా! నీవు వీరుఁడవు కావా? నీకుఁ బౌరుషములేదా? నీవు రాజపుత్రులకుఁ బుట్టలేదా? శౌర్యహీనుఁడా!

(వక్షస్థలముపైఁదన్నును)

జగ—(అవమానమును సహింపక రోషాయితలోచనుఁడై కోపముతో) ఆఁ!-ఆఁ-! ఏమి?-తుచ్ఛుఁడా?- (అస్మత్‌ఖాన్‌పైఁబడి వానిని క్రిందఁబడవైచి వానియొద్దనున్న యాయుధములఁ గ్రహించి) తులువా? ప్రాణదాతలతోఁ బోరొనరించుట పాడిగాదనియూరకుండ నన్నవమానించెదవా? క్రూరుఁడా! పొమ్ము! నిలువక పొమ్ము! ఇప్పుడు నిన్నుజంపిన నీకుదిక్కెవ్వరు? పొమ్ము! పాపీ! నిన్నుజంపను. విడచితిని. నీదానమునకు మరలఁ బ్రాణదానమిచ్చితిని. పొమ్ము! (అస్మత్‌ఖానునితన్నును)

అస్మ—(మోమునువాల్చి) జగత్సింహా! నాకఁతములోఁ బ్రాణముండగా నీవు సౌఖ్యమందఁజాలవు. (అవమానముతో వెడలిపోవును.)

పంచమాంకము.



శ్రీరామచంద్ర

# ఆయేషా

## షష్ఠమాంకము.

రంగము. గిరిమందరము. తిలోత్తమశయ్యాగారము.

ఆయేషా తిలోత్తమకలంకారము జేయుచుండును.

ఆయే—(అలంకారములు పూర్తియైనతరువాత) ఇప్పుడద్దమును జూచికొనుము,

తిలో—(అద్దమునఁజూచి) సోదరీ! బాఁగుగా నున్నది!—

ఆయే—సోదరీ! నావచ్చినకార్య మైనది! జగత్సింహుని పట్టాభిషేకమునుజూచి నేఁడే వెడలిపోదును.

తిలో—ఆయేషా! — నీకు నేనెంతయుఁ గృతజ్ఞురాలను. నీయుపకారములను నేనెన్నడును మరువఁజాలను. కాని నేఁడే యేగుటకు నీకంతతొందర యేల? మరినాల్గుదినములు మా యాతిథ్యమంగీకరించి పోరాదా?

ఆయే—సోదరీ! — (విషాదముతో నూరకుండును.)

తిలో—ఆయేషా! — ఏలమాటాడకూరకున్నావు? నీముఖము విషాదమును సూచించుచున్నదే?

ఆయే—నీకోరికను మన్నింపఁజాలనందుకు నాకు విషాదముకలుగుచున్నది! ఇంతయే—

తిలో—(స్మృతినభినయించిచిరునగవు) సోదరీ!—నిన్ను నేనొకటిబ్రశ్నింపవలయునని యెంచినాను— కోపమురాదుకదా?—

ఆయే—అక్కపైచెలియలి కలుక పాడమునే?—సోదరీ! నీయభిప్రాయమేమో దెలియఁబలుకుము!—

తిలో—(చిరునగవు) సోదరీ! నీవు సంపూర్ణయౌవనవిరాజితవు! సకలసద్గుణభరితవు!— దివ్యసౌందర్యమూర్తివి!—

ఆయే—(నిస్పృహను దెలుపు చిరునవ్వునవ్వును.)

తిలో—తెలిసినదా?—ఈయౌవనము - ఈసౌందర్యము - యెవ్వరిపాలొనరింపనెంచినావో నేనెరుంగనగునా?.

ఆయే—తిలోత్తమా! నీప్రశ్నమునకు సరియైనబత్యుత్తరమొసంగఁడిస్థితియందు నేను లేను. అయినను బ్రత్యుత్తరమీయకతప్పదు?-

తిలో—సోదరీ! నాప్రశ్నము నీకువిచారకారణంబగునెడల బ్రత్యుత్తరము వలదు—

ఆయే—(నిట్టూర్పు) తిలోత్తమా! - నాకువిషాదముగూర్చునదైనను బ్రత్యుత్తరమొసంగుట నావిధియైయున్నది! సోదరీ! నాహృదయము మీవరకే యొకసుందరపూరుషుని వలచియున్నది!—

తిలో—అయిన నాపుణ్యునింకను నీవెందులకు వివాహమాడలేదు?

ఆయే—నాహృదయ మావీరవరుని స్వాధీనమైపోయినను ఆతనిహృదయముమాత్రము నాస్వాధీనముకాలేదు!—

తిలో—ఆపూజ్యునితో నీవు బ్రత్యక్షముగామాట్లాడి, నీప్రేమ నెరింగించితివా? సోదరీ! - ఈసౌందర్యరాశిని గ్రహింపఁదిరస్కరించునంతటి ధీరుఁడుండునా?

# షష్ఠాంకము

ఆయమే—నాప్రేమ నాతని కెఱింగించితిని - ప్రార్థించితిని - బోధించితిని - అనేకలాభములను జూపితిని - కాని, నామనోగతము సఫలీకృతముగా లేదు!—

తిలో—(ఆశ్చర్యము) సోదరీ! - ఆధీరుని నామధేయము నే నెఱుంగనగునా?

ఆయమే—సోదరీ! - నావిచారము నీకు కూడఁ గల్గునే మోయని శంకించుచున్నాను—

తిలో—(తనలో) ఈమె కోరిక యెట్టిదైనను దానికి నేనుకూడ సహాయము చేయుదును. (ప్రకాశము) నాకు విచార మెందులకు? - నీవిచారమును బాపుటయే నావిధి!—

ఆయమే—సోదరీ!—

సీ. ఎవనివీరవిహార ♦ మింపార వీనుల
విందుగా విని కోర్కె ♦ లందినానొ!
ఎవనిసుందరరూప ♦ మీక్షింప మదిగోరి
ఘోరాటవులలోనఁ ♦ జేరినానొ!
ఎవనిఁ గోరుచు వెంట ♦ నేగి మాయలబన్ని
ధీరతతోడ బం ♦ ధించినానొ!
ఎవనిసాధింపగా ♦ నెంచి నాయింటలా
లించి ప్రార్థించి బో ♦ ధించినానొ!
గీ. అట్టివీరాధికుఁడు, మనో ♦ హరుఁడు, ఘోర
శాత్రవుఁడు, ధీరవరుఁడు, వ ♦ శంబుగాక—
అడలుచుంటిని! సోదరీ! ♦ బడలుచుంటి!
ధైర్యమునువీడి ప్రాణసం ♦ తప్తనగుచు!—
ఇదియ నామనోహరుని వృత్తాంతము.

తిలో—(సాలోచనతో) నామధేయము?

ఆయే—సావధానవుకమ్ము!—చకితవుగాకుము!— అట్టిపూత చరితుఁడే యీజగత్సింహఘఁడు— సోదరీ! నీకయిష్టమైన క్షమింపుము (పార్థన)

తిలో—(చిరునవ్వు) సోదరీ! నీవేమియు నడలవలదు. నేనే స్వయముగా నాప్రాణేశ్వరునితోఁజెప్పి యొప్పించెదను. సోదరీ! నాకెంత యుసంతోషముగానున్నది. సోదరీ! ఇది నాకుఁగష్టముకలిగించునని తలచితివా?

ఆయే—(తిలోత్తమను కౌగిలించుకొని ఆనందభాష్పములతో) సోదరీ! ఎంతమంచిహృదయము!—

తిలో—(ఉలికిపడి) చెల్లెలా! వారు వచ్చుచున్నారుకాఁబోలు! నీవాచాటుననుండి మాసంభాషణ నాలకించుచుండుము?

ఆయే—(చాటున కేగును.)

ప్రవేశము : జగత్సింహుఁడు.

తిలో—(పరధ్యానము : దీర్ఘాలోచన, నటించును.)

జగ—(చిరునవ్వుతో తిలోత్తమభుజముపైఁజేయివైచి.) ప్రేయసీ! ఇంకను నీదీర్ఘాలోచనలును విషాదసాత్త్వికములును, విడువ లేదు కదా? ఇప్పుడంతయు సంతోషమేకదా!

చ. జనకుఁడు మోదమంది తన ♦ సమ్మతినిచ్చెను నీదుపెండ్లికై;
కనగ సుభిక్ష సౌఖ్యమును ♦ కల్గెను దేశములోన; నేఁడు నీ
జనకుని రాజ్యవైభవము ♦ చానరో! నీకు లభించె; ఏలనీ
మనమునఁ జింతనొందెదవు? ♦ మానితసౌఖ్యము నీకు కల్గగన్?—

తిలో—(ఉలికిపడి లేచి) నాథా! ఇందాసీనులుగండు!

జగ—నేనుకూర్చుండుట కేమికాని - నీవిచారకారణమును నాకెరింగింపరాదా?

తిలో — ప్రాణేశ్వరా! నాకు విచారముండుననియే తలంచిరా? ఏలకల్గును?

చ. సఫలతనొందె నాదగు ♦ జన్మము కోరినకోర్కెలిచ్చి మీ
రపరిమితానురాగమున ♦ యంబున నన్ పయిఁజూప ; నింక నా
తపములు పండె; తీరె ముదం ♦ బొనఁగూడె; సుఖంబు మీరె; నా
కిపుడు విచారమేల? హృద ♦ యేశ్వర! ధన్యనుగానె నేనిక౯!

జగ — కష్టపరంపరలన్నియుఁదొలంగి సౌఖ్యమునుపొందు నీసమయమున నీవీకన్నీటిలోఁ జనలు సేయ నీహృదయంబునకు శాంతికలుగలేదని తలంచుచున్నాను. ప్రేయసీ! దేశమున దుర్మార్గములడంగెనుకదా! ఇంక నీమనోగతవిచారకారణము నేనూహింపఁజాలకున్నాను.

తిలో — నాథా! మీరనినటుల నాకుసర్వసౌఖ్యములును లభించినమాట వాస్తవమే; కాని, నాయభీష్టముల నెరవేరుటలో నింకను కొంత కొరఁతగలదు?

జగ — ప్రాణేశ్వరీ! ఆకొరంతను నాకుఁదెల్పరాదా!

తిలో — నాథా! తెలుపకేమి? ప్రాణేశ్వరా! నేనీకోరికను కోరుచుంటినని మీరన్యథా భావింపవలదు! నాసాహసమునుమన్నించి నన్ను క్షమించి నాకోరికను నెరవేర్పఁబ్రార్థించెదను. నాకోరిక మీవలననే నెరవేరవలెను.

జగ — నీకోరికయెద్ది?

తిలో — (చిఱునవ్వు) ప్రాణేశ్వరా! — జగదేకసుందరి - నవయౌవనవిరాజిత - సకలసద్గుణభరిత - నిరుపమానలావణ్యసీమ - జీవితేశ్వరా! ఆమేమా మీరుండఁగోరుచున్నది! — మీస్నేహమును వాంఛించుచున్నది! — మిమ్ముఁలవివాహమాడి, సుఖంబునొందఁ జూచుచున్నది! నాథా! ఆమెకోరిక నాకోరికయే! ఆమెను దోసిలిబుచ్చుట మీకుధర్మముఁ కాదు! - నాథా! క్షమియించుఁడు - నాకోర్కెను దీర్పుఁడు.

నాకుసహోదరీలాభమును సమకూర్చుఁడు-ఆమెను బరిగ్రహించి, ఆమెకు హితవొనగూర్పరా? ప్రాణేశ్వరా!

జగ——(నిట్టూర్పుతో) ప్రియసీ! నీకీవిషయము లెట్లు దెలిసినవి?

తిలో——ఆమెయే నన్ను ప్రార్థించినది. ఆమెకోరిక యున్న నాక పరిమితసంతోషముకలుగుటచే మిమ్ములఁ బ్రార్థించుచున్నాను.

జగ——తిలోత్తమా! ఆయేషా నాకత్యంతోపకారములను జేసి నమాట వాస్తవమే! ఆమెనాకు దైవసముురాలు! అదిగాక నేనుగాయ ములచే స్మృతిదప్పి బాధనొందుసమయమున నేకోదరివలె నాపార్శ్వ మున గూరుచుండి రక్షించినది. ఆమెపూజనీయురాలు! ఆమెనన్యవిధం బగుప్రేమచేఁజూడ నాహృదయ మంగీకరించుటలేదు.

తిలో——ప్రాణేశ్వరా ! మీరట్లనిన, ఆమెజీవిత మేమికావలసి యున్నది? - నాథా! నాప్రార్థనమంగీకరించి ఆమెను బరిగ్రహించి, ఆమెకు సౌఖ్యమొనగూర్పరా? సర్వవిధముల మనశ్రేయోభిలాషిణియై మనకొరకు పాటుఁబడెడియామె మనోవాంఛితమ్ముఁ దీరుప మీవిధికాదా?

జగ——(నిర్మలత) ప్రియసీ! ఈవిషయమును నింక నాకుసీవు జెప్ప కుము. ఏలకో నామనమంగీకరించుటలేదు!

ఆయే——(ప్రవేశించి జగత్సింహుని పాదములకడఁ గూరుచుండి) వీరపురుషా! క్షమియింపవా? ప్రణయసంతాపతప్తయగు నిదీనురాలి ననుగ్రహింపవా? రాజపుత్రా! నీవంటి యుదారస్వభావుఁడు - నీయట్టి సదయహృదయుఁడు - ఈలోకమునఁ గానరాఁడు! జగత్సింహా! ఇంక నాకుసౌఖ్యమునొసంగవా? - నన్ను మన్నింపవా? - నన్ను వివాహ మాడవా?

జగ——(చిరునవ్వుతో) సోదరీ! మీకోరిక నిరాధారమైనది యీప్రార్థన కేనంగీకరింపఁజాలను - అంగీకరించను. మీరు మీమేన మరందియగు ఆస్మన్‌ఖానును వివాహమాడి సుఖయింపుఁడు.

ఆయే—(కోపముతో లేచి) ఔనా? - ఔనా? _ ఔనా? - ఇంత తిరస్కారమా?—ఇంత నిరాదరణమా?— ఈనవాబునందిని యొకరాజపుత్రికచేఁ బరిభవింపఁబడవలయునా? - జగత్సింహా!— చూచి కొనుము నీపాటిక! - నీస్నేహలాభముతో నాకగత్యము లేదు!— నా పరాభవమునకుఁ బ్రతీకారమును జేసెద!—కాచికొమ్ము!— ఈయాడుసింహము రాజపుత్రికురంగశాబకముల నెట్టుల భక్షించునో జూచి కొనుము-(ప్రత్యుత్తరము లేకనే చురచుర వెడలిపోవును.)

జగ—(ఆశ్చర్యస్తబ్ధుఁడగును.)

---

ద్వితీయరంగము : నగరు

ప్రవేశము : ఆయేషా,

రోషకషాయితలోచనయై

ఆయే—(కోపముతో) ఈకఠినహృదయు నెటుల మారణము జేయఁగలను!—ఈహృదయవిహీను నెట్టుల నెదుర్కొనఁగలను!—అక్కటా ఎంతటిమూర్ఖత!

సీ. ధీరనామ గరిమం ♦ దిరదుర్గపతనంబు
స్థిరతరంబుగను సా ♦ ధించినాను;
సాధించి దుర్గేశు ♦ బాధించి స్త్రీలతో
హృదయహీను చెరబె ♦ ట్టించినాను;
బెట్టించి విమలాది ♦ వీరకాంతలకెల్ల
వివిధసౌఖ్యముల ని ♦ ప్పించినాను;
ఇప్పించి యీక్రూరు ♦ నింటజేర్పించి లా
లించి ప్రార్థించి బో ♦ ధించినాను;
గీ. చిత్తహీనుని బ్రేమఁ ♦ బూజించినాను;
ఈత్రిలోత్తమచేతఁ జె ♦ ప్పించినాను;

అక్కటా! ఎన్నివిధముల ♦ నైనఁబట్టఁ
జాలనైతిని వాని పా ♦ షాణహృదయు!

(ఇటునటు పరికించి.) ఇంకను రాఁడాయాస్మాన్? (ప్రకాశముగా) ఆస్మాన్! ఆస్మాన్-

ఆస్మా—(ప్రవేశించి ఆలోచనతో) ఏమి?

ఆయే—ఆస్మాన్! (నవ్వుచు) నాకోరికనుమన్నింతువా!

ఆస్మా—(విసుగుతో పరోన్ముఖుఁడై) ఏస్థలమునందును, ఎట్టిసమయమునందును - ఆయేషా!— నీకోరికను నెరవేర్చుటయే నాజీవితమునకు ఫలము.

ఆయే—సోదరా! నావాంఛితమును నెరవేర్చి, నాకు సౌఖ్యము సమకూర్చెదవా?

ఆస్మా—నాహృదయము చంచలమైనది కాదు!

ఆయే—అట్లయిన - సోదరా! ఆస్మాన్! - మనకీరాజపుత్రిల స్నేహముతో సంబంధములేదు!—నాప్రేమతో సంబంధములేదు!—నీవీక్షణముననసకలసైన్యసమేతుఁడవై యుద్ధసన్నద్ధుఁడవై ఈ - జ - గ - త్సిం - హు - ని - (నిట్టూర్పుబుచ్చి గద్గదికము.) ఈజగత్సింహునితో రణమొనరించి వాని - (కోపము కంపము.) విగతజీవునిం జేయుము. నేనును స్వయముగా రణమొనర్చెదను. (ఆస్మాన్ పాదములకడ గూర్చుని) సోదరా! ఆస్మాన్! నాకోరికను నెరవేర్చవా?

ఆస్మా—(ఆతురతతో ఆయేషానుదిలకించుచు) ఆయేషా! ఇంతమాత్రమునకై నీవిట్లు ప్రార్థింపవలయునా? ఎట్టికష్టములందును - నీకు సౌఖ్యమొనగుటయే నావిధి! - నీహృదయమునకాహ్లాదమును సమకూర్చుటయే నావిధి! - ఆయేషా! - లెమ్ము! - లెమ్ము! - ఆతుచ్ఛునిఁ బరిమార్చెద! - ఆరాజపుత్రుని మారణముగావించెద! -

కాలపరిస్థితులచే నాహారమునొల్లక త్రిప్పబట్టియున్న నాఖడ్గమున కీరాజబలినొసంగెద. ఆయేషా! ఇటుచూడుము.

అస్మాక్ ఈల వేయును.

పఠాను సైనికులుప్రవేశము

ఆస్మాను కవాతును జెప్పును!

అనంతరము.

ఆయేషా — (సైనికులను జూచి) సైనికులారా! ఈకోలాహల మెందులకో తెలియునా! నేడు సమయ మరుదెంచినది - నేడు మీమీపరాక్రమంబులఁ జూపెట్టుడు వేళ యరుదెంచినది - నేడు మీఖడ్గములత్రిప్పి దుష్టిగొట్టుసమయ మరుదెంచినది - పఠానులారా! నాయనుంగుప్రజలారా! - నావీర సైనికులారా! - వినుచున్నారా! —

ప్రథమమున నీయొరిస్సాబంగాళా రాజ్యములు మనస్వాధీనములో నున్నసమయమున - మనపూర్వనాయకుఁడగు షర్ఖానుఁడు పాలించు సమయమున - అసూయజెంది - దురాగ్రహావేశుఁడై - మనరాజ్యములవిధ్వంసమొనరింప బ్రయత్నించినవాఁడు మొగలుచక్రవర్తియగు హుమయూనని మీకుఁ దెలియునా! - కటకటా! ప్రచండ సేనాసమన్వితుఁడై యట్లరుదెంచు మొగలునాయకునిఁజూచి - సమర్థుఁడయ్యు - బుద్ధిశాలియయ్యు - పరాక్రమవంతుఁడయ్యు - మనషర్ఖానుప్రభువు ఎంతయడలవలసివచ్చినది? - గ్రామములనక . పల్లెలనక - అడవులనక - పరువిడి - సైనికులారా! - మనపూర్వనాయకునిస్థితిని ఆలకించిన మీకు హృదయము చెదరదా?

(సైనికులు విచారమును సూచింపుదురు.)

ఆయేషా — సైనికులారా! మీహృదయభావములు నాకుఁ దెలియవచ్చినవి. అట్లుపారిపోయినను జడియక - మరలనరుదెంచి యామొగ

లునాయకుని గర్వమడంచి - ఢిల్లీసింహాసనమధిష్టించి బ్రఖ్యాతివడసిన యాషర్ఖాను మనవంశీకుఁడుకదా!

అట్టివీరాధికుని వంశీకులమై - స్వదేశమును గోల్పోయి - అభిమానములేక - చెట్టులగుట్టలబట్టి - సౌఖ్యములవిసర్జించి - యీవిధమున మనము చెదరియుండుట కెవ్వరుకారణమో మీకుఁ దెలియునా?

(సైనికు లొకరివంక నొకరు జూచుకొనుచుందురు)

ఆయే— తెలియులేదా? నేనే చెప్పెదను. మనయీదుస్థితికిఁ గారణమీజగత్సింహుని తండ్రియగు రాజామానసింహుఁడు? మొగలాయీచక్రవర్తి పనుపున నీమానసింహుఁడు మనలనుజయింప నరుదెంచి బంగాళారాజ్యమునుజయించి, మనలకు నిలువనీడ నైననొసంగకఁ దరిమివైచినసంగతి మీకెల్లరకు విదితమేకదా! తండ్రిపనుపున నిప్పుడీజగత్సింహుఁడు మనల నెచ్చటనిలువనీయక చెల్లచెదరు జేసినమాటకూడ వాస్తవమే! కావున పఠానులారా! మీరుమీయాత్మగౌరవమున కాశించి మీవంశప్రతిష్ఠ నిలుపుకొనఁ జూచెదరేని—మీపరాక్రమము సార్థకతకుఁ దెచ్చెదరేని—మీరణకౌశలమందు మీకు విశ్వాసము కలదేని లెండు!—ఆరాజపుత్రులతో రణమొనరింపుఁడు!— మీకులగౌరవమును నిలబెట్టుఁడు!—సమయమరుదెంచినది!—

సైనికులు 'దీన్ దీన్' అనుచు వీరావేశపర
వశులగుదురు

ఆయే—(ఆవేశము) నేనేస్వయముగ మీకధిపత్యము వహించెద!— (కత్తిని గైకొని) ఆస్మాక్! లెమ్ము!—సైనికులారా! లెండు!— ఆయుధముల ధరియింపుఁడు!— మీలో నెవ్వరారాజపుత్రునిశిరఃఖండనముగావింతురో వానికి ఉపసేనానాయకపదవి యొసంగఁబడును!—

లెండు! దైవమునుస్మరింపుఁడు! (అవేశము) దీన్ ... దీన్.
అల్లా హెూ!

సైనికులు తన్మయత్వముతో దీన్, దీన్
అని కోలాహలము జేయుచుఁ బరువులిడు
దురు. ఆయేషా, అస్మన్, వెంబడింతురు.

తృతీయరంగము : యుద్ధభూమి.
పఠానులకును, రాజపుత్రులకును సంకుల
సమరము : ఆయేషా, పోరుచుండును :
అస్మన్, జగత్సింహులు మరియొక వైపునఁ
బోరుచుందురు. సైనికులంద రొక వైపున కేగెదరు.
ఆయేషా శరీరమునగాయములుతగుల
రక్తక్షీణముచే మూర్ఛపోవును.

ఆయే—(స్మృతికల్గి మూల్గుచు లేచి కోపముతో) ఏడీ? - జగత్సింహుఁడేడీ? వాని నీక్షణమందే శమనపురి కంపెద! - (లేచిబలహీనముచేఁ దూలిపడిపోవుచు) అబ్బా! - ఇదియేమి? నాకన్నులు తిరిగిపోవుచున్నవి! లేదు. ఈప్రపంచమే తిరుగుచున్నది. (ఆయాసముతో) కాదు - యుద్ధము - మనోహరుఁడు - జగ - త్సింహుఁడు - అబ్బ! అబ్బ! బాధ! ఆయాసము! - కష్టము (లేచి) ఆహా! నేనిట్లు పడిపోయితినేమి? నాసైనికు లేరి? యుద్ధమేది? (కోపము) జగత్సింహుఁడేడీ? (ఇటునటు పరికించి) అదిగో! యుద్ధమాదెస జరుగుచున్నది! నాఖడ్గమేది? - (ఖడ్గమునందుకొనఁబోయి ముందునకుఁబడి యిటునటుపొరలి లేచి) ఇదియేమి? నేను లేవలేనా? (తూలుచు ఖడ్గమునందికొని లోనికిఁ జూచి ఆనందము) అదిగో! జగత్సింహుఁడు! ఇటేవచ్చుచున్నాఁడు! ఆతనిశరీరమునిండ గాయములు తగిలినవి? రానిమ్ము! (రెండడుగులువైచి

స్మృతిఁదప్పి పడిపోవుచు) జగత్సింహా! క్రూరుఁడా! రమ్ము. నిన్ను ఖండిం చెదను! రమ్ము! అబ్బా! - బాధ! (శరీరమును జూచుకొని) అయ్యో! రక్తము - నాకుగాయములు తగిలినవా? - నేను లేవలేనా? - నేనిఁక జీవింపనా? _ అబ్బా! - దాహము! దాహము! దా-హ-ము! (మూల్గుచు) నాకన్నులు పచ్చబడుచున్నవి! (మూర్ఛ బోవును.)

ప్రవేశము : జగత్సింహుఁడు

గాయములచేఁ దూలుచు

జగ—(శిరస్సుబట్టుకునితూలుచు) అబ్బా! దాహము - దాహము!—క్రూరాత్ములు!— పఠాను లన్యాయముగ - యుద్ధము - ఉఁ—అబ్బా!—న్యాయము లేదు - దుర్మార్గులు - పఠానుకులను, మొగల్ చక్రవర్తికిని - సంధిపొసగ - లేదే! ఈపఠానులిప్పు డశేష ముగ - ని - ర్మూ- లింపఁబడినారు- (బాధనభినయించుచు) అబ్బా!— ఆయేషాయెంతదృఢస్వాంతురాలు!— ఎంతటి ధీమంతురాలు! ఆమె ప్రేమ - - - అబ్బా!—అయ్యో!-(క్రిందఁబడిపోయి బాధచేఁబొరలు చులేచి కన్నులుమూసికొని) తిలోత్తమా! --(చేతులఁదడవికొనుచు) తిలోత్తమా! మదీయప్రేమమూర్తీ! ఎందున్నావు?—నీజీవితేశ్వరుఁడు- నీప్రాణసాధుఁడు - తన - ప్రాణావసానకాలమున - నిన్నే - స్మరిం చుచు ఉఁ - అబ్బా! బాధ!—తలంచుచు - ప్రాణములనువీడుచు న్నాఁడు - కడసారి - నీసందర్శనమీయవా? ప్రియసీ!—ఎవనికొరకిన్ని - కష్టముల - పొందుచుంటినో - అట్టినీవు - ఇప్పుడైనను - నాకన్నులకు---అబ్బా!—(మూర్ఛాగతుఁడౌను)

ప్రవేశము : తిలోత్తమ.

పరుగున.

తిలో—హా! ప్రాణేశ్వరా! నన్ను వదలిపోవుచుంటివా? నేను నిన్నెడబాసి యుండగలనా? కటకటా! ఓజగదీశ్వరీ! ఏపాపపుణ్యంబుల

నెరుంగనినీయాశ్రితుల కిట్టిబాధలఁగలుగఁజేయుచున్నావేమి? ఓభారతాంబా! నీపుత్రుల కిట్టిదుర్గతి కలుగుటకునీవుచేసిన పాపమేమి? (జగత్సింహునిజూచి) ప్రాణేశ్వరా? ఇదే నేనునువచ్చుచున్నదాన! (కైజారును దీసి పొడుచుకొనఁబోవును)

జగ — (కన్నులుమూసికొని లేచి చేతులఁదడవుచు) ప్రియురాలీ! నేను - నిన్ను విడచిపోవుచున్నాను - దైవసంకల్పన - మట్లున్నది (కన్నులఁదెరచి తిలోత్తమనుజూచి ఆనందముతోఁగౌఁగిలించుకుని)అబ్బా! దా - హా - ము - - దాహాము!— (మూర్ఛబోవును.)

తిలో — ప్రాణేశ్వరా! నేనును వచ్చుచున్నాను (కైజారుకంఠమున బొడిచికొని) వచ్చుచున్నాను - - (జగత్సింహునిపైఁజేయివైచి మరణించును.)

ఆయే — (మూల్గుచు లేచి) దాహాము! - అబ్బా! దాహాము— నానాలుక పెనవేసికొనిపోవుచున్నది -(ఇటునటు పరికించి తిలోత్తమా జగత్సింహులఁ జూచి) అయ్యో! నామనోహరుఁడు - మరణించి - అబ్బా! (దగ్గరకుజరిగి) ఇంకనుమరణించలేదు - సోదరి! తిలోత్తమ - ఊఁ - హా! అబ్బా! దేహమునుచాలించినది - నామనోహరుఁడు - నా వీరసుందరుఁడు - ఎంతఅందముగా - మన్నాఁడు? - ఇప్పుడే - ఈసుందరపురుషుని - వివాహమా - పెద! - అబ్బా! దాహాము! (హస్తమును జగత్సింహునిపైవైచి మూర్ఛఁబోవును)

జగ — (మూల్గుచు) దా - హా - ము - జగదీశ్వరా! శలవు (లేవబోవును)

ఆయే — (స్మృతి) మనోహరా! నేనిచ్చటను - న్నాను! - (ప్రాణే - శ్వ - రా! - రమ్ము! - నన్ను - పరిగ్రహింపుము - ఇరువురమును గలసి - ఆలోకమున - కేగెదము—

జగ — (ఆయేషావైపు చేతులడ్డముబెట్టి) వ - ల - దు.

సోదరీ! - అబ్బా! బాధ - హర - హరా! - (వెనుకకుబడి మర ణించును)

ఆయే—మనో - హరా! అబ్బా! నిన్ను - బెండ్లా - డె - దను (జగత్సింహునిపైఁబడి మరణించును.)

ప్రవేశము : విమల.

విమ—(శవములను జూచి) ఛీ! ఛీ! ఇఁక నాజన్మమెందులకు? ఇంతకును, ఇన్నియనర్థములకును గారణభూతురాలనైన, నాజీవితమెందు లకు? - - - నేనును నామనోహరుఁ గలసికొనెదగాక! (పొడుచుకుని మరణించును.)

ప్రవేశము : అస్మాన్.

గాయములతో

అస్మ—ఛీ! ఛీ! ఇంకనా కీజన్మమెందులకు? అందరినిబాసి-అన్ని సౌఖ్యముల విసర్జించి - ఛీ! ఛీ! ఎందులకు (ఆయేషానుజూచి తెల్ల బోయి) ఆహా! నాప్రేమకారణము నశించినది! ఇంకనాజీవితము వ్యర్థము! ఆయేషా! నీకోరిక - నీసౌఖ్యము - నెరవేరినది! ఇదిగో! నేనును - నిన్నుగలసికొనుచున్నాను - (పొడుచుకొనిమరణించును.)

సమాప్తము.

సంపూర్ణము.



శ్రీరాజన్ ముద్రాశాల, రాజమండ్రి.

